స్వాతంత్ర్య కుసుమమాల

ద్వితీయ కుసుమము

# శ్రీగాంధిభారతము

(భాగము II)

## నిర్వాణ పర్వము.

జననీ జన్మభూమిశ్చ। స్వర్గాదపి గరీయసీ
తస్మాత్త్వయోః పదాబ్జేషు। కావ్యసూనం దదామ్యహం॥
నమామి భారతావని నమామి కర్మసాధని
నమామి పుణ్యరూపిణి। నమామి జ్ఞానదాయిని॥

రచయిత:-

*Dr. M. Seshacharyulu*
*L. M. & S.*



1949 - 1000 Copies

శ్రీ లక్ష్మీప్రెస్, బందరు.

# స్వాతంత్ర్య కుసుమమాల

## ముఖ్యోద్దేశములు



1. ఆంధ్ర సారస్వతసేవ

ఆంధ్ర రచయితలసేవ:- వీరు సంఘీభావములేమిచే వారి మనో ఫలఫలంబుల ననుభవింపలేకున్నారు- అట్టివారికి వీలైనంత సహాయమొనర్చుట మా యాశయము-

ఇతర వివరణములు వేఱొకచోట చూడుము-

## EDITORIAL BOARD.

# తొలిపలుకు.

దయాసత్యశౌచము లనుష్ఠేయములనుట సర్వమతసమ్మతము. అందాదిమ మహింసాతత్త్వము. అది సత్త్వగుణప్రధానము కావున, నద్దానిని సాత్త్వికగుణము లెనిమిదింటను యోగయమాంగములు పదింటను సుజ్ఞానదాయకములు పదునాల్గింటను బరిగణించిన దటుండ నదే సర్వసాధకమనుటకు రాజలక్షణ సప్తకమందుం జేర్కొని, 'అహింసాపరమోధర్మ' యని యుగ్గడించియున్నారు.

అట్టి యీ యహింసను సద్బోధించిన బుద్ధుండిట భగవానుండనియు ఖండాంతరములందుంగూడ (The Light Of Asia) అనియుం బొగడొంద, నిపుడద్దానినే యాశ్రయింపంజూచిన శ్రీ గాంధజీకి 'మహాత్మ' బిరుదమొదవెనన్న నబ్బురమేటికి? ఇట్టిలోకైకవిఖ్యాతుని గూర్చి వివరించుటయన దివాకరుంజూప దివ్వెవట్టుటయ కాని,

ఆహవమందు ప్రాణముల నారయునొక్కటి కోలుపోక, వై
దేహిసగొంచుఁ దెచ్చువగిదిన్ గద, భారతపారతంత్ర్య మె
ట్లోహరియింపనయ్యె, నిఁక నున్నదె యగ్నిపరీక్ష ముందనన్
మోహనదాసునిం గెడప, మోక్షము సుస్థిర మెట్టులో నొకో!

యనువిచికిత్సకాకరమగు సంఘటనము తేర్చుటలో నేసుక్రీస్తునకును మిక్కిలిగా నీతని యశోవల్లరులెల్ల దెసలకుఁ బ్రాకొని వెల్లివిరియఁజొచ్చెను. మఱియు నేయవతారమూర్తికిం బ్రాప్తింపనిమై జీవించియున్ననాఁటనే స్వపరదేశములందు దద్విగ్రహములు ప్రతిష్ఠింపఁబడియుండ, నిపుడపూర్వదిగ్దేశాసి నిక్షేపములైయుంట నూరూరనేకాక ఖండాంతరములందును దద్విగ్రహారాధనాదికములు ప్రసంగింపఁబడుచున్నవార్తలు వినవచ్చుచున్నవిగదా.

ఇట్లు సుస్థిరకీర్తియగు నీయుగపురుషుని చరిత్రమరసి తెలిసికొనవలెనని ముందెవ్వఁడనుకొనకుండురు? ఇంక నిప్పటిస్వార్థత్యాగులందెల్ల నగ్రగణ్యుండై, 'దరిద్రనారాయణుం'డనియెంచ నిరుపేదలలోఁ గలిసిమెలసిన సాధుజీవనము నెఱపి పడరానిపాట్లువడి బహుళోపవాసరూపమగు తపంబుసలిపి నిజదేశమాతను విశృంఖలఁ జేయఁ జాలినట్లయిన యీ మేటి, "అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాఁడు నేర్పరి" యన్నచందాన మొగిఁ జూచుచు నైకమత్యము

కొఱకే నిజజీవితమును ధారవోసినవాఁడయ్యెను. అట్టి యీ గాంధిజీ చరిత్రమునకును భారతచరిత్రమునకు నేర్పడిన యవినాభావసంబంధమువల్లనే యీ 'గాంధిభారతము' వెలువడవలసెను. అందును ప్రస్తుతమందఱకు గుండియలవియఁజేసి యుట్టుడికించినట్టియున 'నిర్యాణపర్వమే' ముందు వెలువడుచున్నది.

ఇఁక రచయితయన్ననో, సంఘసేవా పరతంత్రమతియగు హూణవిద్యాభ్యాసియొక భిషఙ్మణి. ఈతనికలవడిన యీ నైపుణ్యమానుషంగిక ప్రతిభయే కాని, నిజస్మృతిలో సంఘటించునైనది కేవలబలాత్కార ప్రసూతి కాదు. ఏలయనఁ దజ్జనకులు శ్రీమాన్ చినలక్ష్మీనరసింహాచార్యుల వారాంగ్లమున నాంధ్రమునఁ గూడఁ బద్యములల్లుచుంటయు, నన్న శ్రీ పార్థసారధి ఆచార్యులుంగారు నేవేవో రూపకములఁ గూర్చుచుంటయు నటుండ నాబాల్యము నస్మదాదులము సతీర్థ్యులము కాఁగాఁ దానునేవేవో గణబద్ధమొనర్పఁజొచ్చి యెప్పటివప్పుడు నాకుఁ జూపుచుంటచేత నీతని రచనములందుఁ గ్రమముగా నొదవిన పరివర్తనములకేన సాక్షినై యున్నాను.

అందును ప్రస్తుత కథావస్తువే కరుణమున కిరవైనదయ్యెను. తానా, కథానాయకునెడ భక్తిభావంబు మీఱఁ బరితాపపూరిత హృదయుండై వ్రాసిన యుదియయ్యె. ఇంక రసోదయమునకుఁ దావలములౌనవి యుండకుండునా? అట్టివి పాఠకులకే పొడకట్టఁదగుఁగాన సిందుదాహరించి విస్తరింపను. దేశకాలపాత్రోచితములౌ నానవరణలును బాఠకులకు నద్భుతానివే. గుణగ్రహణ దక్షులౌ విచక్షణులిద్దానింబరికించి యీ కుసుమము శిరోధార్యముగా నెంచి యీతని పూనికనింకఁ గొనసాగించెదరు గాత.

అజరానంతదిగంత నిర్మలయశోవ్యాప్తి ప్రసక్తింప, లో-
కజనారాధ్యము 'గాంధిభారత' మనంగా, నీ'మరంగంటి వం
శజ శేషాహ్వయ కర్తృకంబు చిరమాస్థానంబుఁదానొందుగా
త, జయంబబ్బుత, మానతీర్థ్యునకు, సుధాస్ఫూర్తి పెంపొందుతన్॥

బందరు
10-3-49

ఇట్లు
సుధీవిధేయుడు
నాఁడెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రి

# ఉపోద్ఘాతము

ఈ స్వతంత్ర కుసుమమాలయందు ద్వితీయ కుసుమముగా శ్రీ గాంధీ భారతము నిర్యాణపర్వమును బ్రచురించుచున్నాము. భారతదేశము స్వాతంత్ర్యమును సంపాదించుటకు చేసిన శాంతిసమరమునందు మహారథుడుగానుండి, జయమును జేకూర్చిన వీరాధివీరుడు, మహాత్ముడు భారతదేశ దురదృష్టవశమున స్వతంత్రము సంపాదించిన యచిరకాలములోనే దివంగతుడగుట, యపార దుఃఖకారణము. సంతోషముతో ధర్మరాజ్య సంస్థాపనాచార్యుడై, దుర్విషయలోలత్వమునబడి, దారితెన్ను గానక వర్తించు పాశ్చాత్య లోకమునకు, సత్య ధర్మములనే యుత్తమదీపికల నొసంగి, తప్పు మార్గములను త్యజించి సరియైన మార్గములోనికి తీసుకొనిరా బ్రయత్నించినవారిలో నెల్ల నుత్తముడు మహాత్మ గాంధి. అట్టి పురుషోత్తముని వీరునిగా గ్రహించి, యా మహాపురుషుని యుత్తమచెయ్యుల నభివర్ణించు నూతన గ్రంథమును వ్రాయుట మహోత్కృష్టకార్యము. ఈ కార్యమును జేసి దానిద్వారా దేశమాతారాధన జేయగల్గిన యదృష్టము మా కుసుమమాలకు గల్గుటెంతయు ముదావహము.

అపార చింతాజనకమైన గాంధీమహాత్ముని నిర్యాణ మభివర్ణించినతరువాత, స్వాతంత్ర్య సుగుణలతామతల్లి కాలవాలంబగుచు దేశసేవయే జీవిత యుత్తమాదర్శంబుగ నెలకొల్పుకొని స్వార్థత్యాగజ్యోత్స్నా విరాజిత జీవనముల గడుపుటకై నిశ్చయించి సర్వజీవన వ్యవహారములును మహాత్ముని యుత్తమాదర్శవాసనా విలసితంబైన సామాన్య దైనందిన జీవితములుగ గడుపు, స్వీయకృషి (Self-sufficiency) తృప్తులైన శాంతాశ్రమవాసులకు, సకల సవీసతి

హాసవర్ణన కళావిశారదుండైన యభినవ సూతమహర్షి శ్రీ గాంధీ జీవితమును వర్ణించి చెప్పుటే యీ గ్రంథము కథావస్తువు. దీని కాధారములు మహాత్ముని స్వీయచరిత్ర, మహాత్ముని సంపాదకత్వమున బ్రచురింపబడిన 'యంగ్ ఇండియా', 'హరిజన్' పత్రికలు, నిర్యాణ సందర్భమున బ్రచురింపబడిన వార్తలు, వ్యాసములు, ప్రసంగములు. అవి, యివి యననేల ? మహాత్మునిగురించి యీ యుగమున వ్రాయబడిన ప్రసంగ, వ్యాస, జీవిత చారిత్రవాసనాయుతములై ప్రచురింపబడిన, సమకాలిక సర్వవర్ణనములు, భావములు, తలంపులు, ఆదర్శములు. ఇవికాక యుగపురుషుల యుత్తమాదర్శ జీవితపద్ధతులను జనసామాన్యమున కుత్తమరీతిని బ్రదర్శించవలసిన, కవిజనధర్మముకూడనూ, ఈ గ్రంథరచన కుత్సాహము కల్పించినది. ఈ గ్రంథ మెనిమిది భాగములుగలిగి షుమారు 3000 పద్యములతో, భారతదేశ ప్రాచీనపు టౌన్నత్యతత్వమును, ఉన్నతాశయ పతనమును, తన్మూలమున స్వాతంత్ర్యనష్టమును, దిఙ్మాత్రముగా సూచించి, మహాత్ముని స్వాతంత్ర్య సంపాదనావ్యూహములను తగురీతి నభివర్ణించి, యా పద్ధతు లేవిధమున లోకమున సత్య, ధర్మ, యహింసాస్వరూప నిరూపణమునకు తోడ్పడి, లోకకళ్యాణమే మానవజాతి యాదర్శముగ నుండవలయునని మహాత్మునిచే నుద్ఘాటించబడినదియు, తల్లోకకళ్యాణప్రాప్తియందు, విశ్వమానవ ప్రేమాసౌభ్రాతృత్వములతోగూడిన, మహాత్మ దర్శిత నూతనాదర్శమార్గముతప్ప మరింకొక పంథా లేదనియు— నా అన్యపంథా౽అయనాయ విద్యతే— యని ఘంటారవముజేసి, తృతీయ పురుషార్థవ్యామోహిత లోకమును, దాని నాశనమునుండి దప్పించి, యాదర్శ పరివర్తన మొనరించు పద్ధతులును వర్ణించబడును. మొగ్గగాయున్న యీ శ్రీ గాంధీ భారతమునుగురించి యింతకంటె నిపుడు వర్ణించుటకు వీలుకాదు; ఔచిత్యమును లేదు.

ఈ గ్రంథమునం దుపయోగించిన భాష, పీఠికాంతవరకును, అర్థవైరుధ్యము గల్గునేమో యని యనుమానము తోచని యన్ని తావులయందును, వ్యాకరణ సూత్రబద్ధమైన గ్రాంథిక భాష, ఇంగ్లీషు భాషలోని వాక్యవిరమణ (Punctuation) పద్ధతులు, సరళ భావస్ఫురణకై, కొన్ని కొన్ని చోట్ల నుపయోగించబడినవి. అట్టి స్థలముల కొంచెము సంధి సూత్రములు సడలించ బడినవి. అధునిక యావసరములనుబట్టి, యట్టి సంధి సూత్రములు సడలించు టావసరమేమో, వ్యాకరణ సూత్రవేత్త లాలోచించెదరుగాక.

ఈ పుస్తకమును కుటీర పరిశ్రమలలో ముఖ్యమై, మహాత్ముని దీవనలందిన చేతికాగితపు పరిశ్రమయందు తయారు చేయ బడిన స్వదేశి చేకాగితములమీద నచ్చువేయ సాహసించితిమి. మహాత్ముడీ కాగితములయందు గనిన సౌందర్యమును, పాఠకులందరు నీ పుస్తకమునందు గని యానందించ వలయునని యాశించు చున్నాము. శ్రీ మహాత్ముని పునీత పాదస్పర్శ పవిత్రీభూతమైన బందరు నేషనల్ కాలేజీయందీ కాగితములు తయారై యుండుట, మరియు నా కోర్కె ఫలించుటకు దోహదము నొసగుచున్నది.

ఇప్పుడు నిర్యాణపర్వము మొదటిభాగము ప్రచురించు చున్నాము. దీనియందు మహాత్ముని మరణ సమయమునుండి సంచయనము వరకును వర్ణించబడినది. భారతీయనేతల, లోక నాయకుల విషాదవార్తలు తప్ప మిగిలిన భావములు స్వకల్పితములు. ద్వితీయ భాగమునందు, ఫిబ్రేవరి 12, 1948 నాడు అలహాబాదునందు జరిగిన విశేషములును, అపరాధుల న్యాయవిచారణ హంశములును, పర్యవసానమును వర్ణించబడును. న్యాయ విచారణ పూర్తికాకపోవుటచే, రెండవభాగ ప్రచురణ కింకను కొంతకాలము పట్టును.

ఈ గ్రంథము లందలి స్ఖాలిత్యములను ప్రేమాపూరిత భావ ములతో దిద్ది గ్రంథరచనకు తోడ్పడిన విద్వద్వరేణ్యులైన, శ్రీ నాదెళ్ళ మేధా దక్షిణామూర్తిశాస్త్రులుగార్కి గ్రంథకర్త నమ స్కార సహస్రంబు లర్పించుచున్నారు. ఇకముందు రాబోవు భాగములను గూడను వాత్సల్యాను రాగములతో, స్ఖాలిత్య రహిత ముగా నుండునటుల దిలకించెదరుగాక ! ఈ గ్రంథమునందలి బ్లాకు లన్నిటిని, నడిగినంతనె, మన యాంధ్రులు కానప్పటికిని, అధికాభి మాన ప్రేమలతో నుచితముగా నొసంగిన బొంబాయి 'ఘోరము' పత్రికా సంపాదకులగు శ్రీ ఆళ్వాగారికి, గ్రంథకర్త వందనము లంద జేయుచున్నాడు. ఈ గ్రంథము నింతకంటెను లలిత స్వరూపగా జేయుటకు నందరు వారి సలహాల దెలియజేసిన కృతజ్ఞతతో వందు కొనెదము.

ఈ గ్రంథమునందలి దోషములను త్యజించి, గుణలవంబుల నేతజ్ఞులు గ్రహించవలయునని గ్రంథకర్త ప్రార్థన. శ్రీ గాంధి మహాత్ముని భక్తబృందమును, దేశభక్తులును, సర్వజనానీకమును, ఈ గ్రంథము నాదరించి, తద్వారా మహాత్ముని యాశయ వ్యాప నకు తోడ్పడవలయునని నిర్మల హృదయులైన దేశభక్తుల నందరిని ప్రార్థించుచున్నాము.

—గ్రంథకర్త



## స్వతంత్ర కుసుమమాల

# సంపాదకీయ భూమిక

పై నామముతో హిందూదేశ స్వాతంత్ర్య సముపార్జన జ్ఞాపకార్థముగ, సారస్వత, శాస్త్ర, వైద్య, రాజకీయ, విషయములను గూర్చి నూతన గ్రంథములను వ్రాసి, దేశసేవచేయు నుద్దేశ్యముతో నీ గ్రంథమాల నారంభించితిమి. దీనియందు సంవత్సరమునకు 400 పుటలకు తక్కువ కాకుండగను, 600 పుటలు మించకుండగ నైదు, లేక నారు గ్రంథములు సంవత్సరమునందు ప్రచురించుట మా సంకల్పము. దీనికి సాంవత్సరిక చందాదారుల నేర్పరచుట మా యభిప్రాయము. సంవత్సరమునకు కనీసము 10/ రూ॥ చందా నిచ్చువారు సామాన్య సభ్యులుగను, 15/ రూ॥ చందానిచ్చువారు పోషకులుగను,' 25/ రూ॥ చందానిచ్చువారు రాజపోషకులుగను, 116 రూ॥ చందా నిచ్చువారు మహారాజపోషకులుగను, నేర్పాటు చేయబడుదురు. ఈ పుస్తకమునందె వేరొకచోట స్వతంత్ర కుసుమ మాల చందాదారు ఫారముచ్చువేయుబడి యున్నది. దానియందు సంతకముచేసి, మీరు కోరిన తరగతియందు మెంబర్లుగా జేరి, ఆ చందాను, ఈ ఫారమును M. O ద్వారగగాని, చెక్కుద్వారాగాని, పోస్టుద్వారా మీరు అందజేసిన, మీరు, ఈ స్వతంత్ర కుసుమ మాలయందు ప్రచురించు గ్రంథముల నన్నిటిని తక్కువ ఖరీదునకు తెప్పించుకొనవచ్చును.

ఈ స్వతంత్ర కుసుమమాలయందు, ప్రథమ కుసుమముగా స్వతంత్ర యుద్ధమను, నాట్యనాటిక (Dance Drama) ప్రచురించి యున్నాము. అది చిన్న పుస్తకము. ప్రధానముగా భరతనాట్య మభ్యసించు పిల్లలకై వ్రాయబడినది. మన భరతనాట్యమునందు హెచ్చుగ శృగారరసమునే వెదజల్లుచుందురు. అటులకాక దీని యందు, దేశభక్తి, వీరరసములు చక్కగా ప్రదర్శించుట కనువగు

వట్లు సుందరమైన, నాట్యమున కనువగు పాటలు పద్యములు వ్రాయబడి, ప్రదర్శనయోగ్యమగునట్లుగా నున్నది. పుస్తకము చిన్నదిగా నున్నను, భరతనాట్య ప్రదర్శనము చేయకల్గినవారు చక్కగ నాల్గు గంటలసేపు ప్రదర్శనము చేయగల్గినంత వీలు దీని యందు కల్పించబడినది. వివిధమైన రాజకీయ భావములు దీని యందు నైపుణ్యముగను, భరతశాస్త్ర బద్ధముగను తజ్ఞులైనవారు చేసి చూపించుటకు బహు వీలుగా నున్నది.

ద్వితీయ కుసుమముగా నిప్పుడు శ్రీ గాంధీ భారతమునందు 'నిర్యాణపర్వము' ప్రథమ భాగమును ప్రచురించు చున్నాము. దీనియం దేడు సుందరమైన బ్లాకులుకూడను, బొంబాయి ఘోరము పత్రికాధిపతుల సానుభూతి మూలమున, ప్రచురింపగల్గినాము. దానికై వారికి మా వందనము లర్పించుచున్నాము. ఈ శ్రీ గాంధీ భారతమునందలి కథావస్తువులను కొంతవరకు నుపోద్ఘాతము నందు సూచించియుంటిమి. ఇది యాధునిక భారత స్వాతంత్ర్య సమర చరిత్రమును, కురుపాండవ యుద్ధమును శ్రీ మహాభారత ముగా బూర్వకవులు వ్రాసిన పద్ధతిని, నాధునిక లోకమునకు నచ్చు నట్లుగా, నవీన చారిత్రిక సంబంధమైన, కథలు, ఉపాఖ్యానములు, నీతులు, శాస్త్రచర్చలు మొదలైనవి కలిగియుండునటుల వ్రాయ బడును. ఇతర దేశ చరిత్రలు కడు రమణీయముగ వర్ణించబడును. దీనియందు గాంధిమహాత్ముడు, భారతమునందలి కృష్ణుని విధము గను, సుభాసుబాబు, దాదావుగా నభిమన్యుని మోస్తరు పాత్రము లును, తదితర కాంగ్రెస్ నాయకులు వారి వారి యుచిత ప్రాముఖ్య పాత్రలను వహించుట సుందరముగను, నుచితరీతిని మీరు పఠింప నున్నారు. ఈ శ్రీ గాంధి భారతము, స్వతంత్ర కుసుమమాల చందాదారుల కందరికిని యితరశాస్త్ర, సారస్వత ప్రచురణముల మోస్తరుగనే పంపబడును. శ్రీ గాంధీ భారతము నిర్యాణపర్వము ఖరీదు 2-8-0 గా యేర్పాటు చేయబడినది. ఈ భాగము 2-8-0

కు కొనినవారికి తరువాత నిర్యాణపర్వము రెండవభాగ ముచితముగ నిచ్చుటయేగాక, స్వతంత్రయుద్ధముకూడను బహుమానముగా నియ్యబడును.

ఈ కార్యము బహుభారమైనది. దీనిని సరిగా నిర్వహించుట కాంధ్ర సారస్వతాభిమానులెల్లరును తగిన ప్రోత్సాహ మొసంగవలయునని కోరుచున్నాము.

స్వాతంత్ర్య కుసుమమాలలోని, శ్రీ గాంధి భారతమును మాత్రమే తీసుకొనదలచినవారి సౌకర్యార్థమై శ్రీ గాంధీభారత మెంబర్షిప్పు నొకదాని నేర్పాటుచేసియున్నాము. దీని యెనిమిది భాగములకును సామాన్య పోషకులకు రు 15 లున్ను, రాజపోషకులకు రు 25 లున్ను, మహారాజపోషకులకు రు 116 లున్ను ఏర్పాటు చేయబడినది. ఈ మెంబరుషిప్పు ఫారముకూడను, యీ పుస్తకము నందె అచ్చువేయబడియున్నది. దానిమీద సంతకముచేసి, చందాలను శెక్రటరీగారికి పంపవలయును. రాజపోషకులకున్ను, మహారాజ పోషకులకున్ను అట్టబైండు, లెదరుబైండు చేసిన పుస్తకములు పంపబడును. శ్రీ గాంధీభారతము అన్ని భాగములందును మొత్తము 79 శ్లోకులును, షుమారు 3000 పద్యములును యుండి, ఆధునిక భారత స్వాతంత్ర్య వ్యూహావర్ణనములుగల్గి, పండిత పామర గౌరవార్హమయి విరాజిల్లుచుండును. ప్రతి లైబ్రరియందును, ప్రతి సంపన్నగృహస్థ గృహమునందును ప్రేమాభిమానములతోనుండి, బహుసౌభాగ్యమయి స్వాతంత్ర్య జ్యోత్స్నాప్రసారముల నల్దిశల వ్యాపింపచేయగలదిగా నుండునటుల సర్వజనములును తగురీతి ప్రోత్సహించవలయునని వాంఛించుచున్నాము.

ఇట్లు,

మ. శేషాచార్యులు, L. M. & S.
శెక్రటరీ, స్వాతంత్ర్య కుసుమమాల - మచిలీపట్నం.

# Swatantra Kusumamala

(To be Registered.)



1. The objects of the Association are:—

(a) To publish books in Telugu, both original works and translations, dealing with Literature of all varieties Prose, Poetry, Drama, Novel, Biography, Essays, Short stories, Songs, Harikathas, Yakshaganam, Folk songs, etc.,

(b) To publish in Telugu standard works, both original and translation, dealing with Fine Arts-Music, Paintings, Bharata natya, Dance, Sculpture, Photography, Cinema technic, and etc., and to publish, Pictures paintings, Photographs of all kinds dealing with all branches of all the above subjects.

(c) To Publish in Telugu standard works, both original and translations, dealing with all Sciences, Physics, Chemistry, Biology, Botony, Zoology. Geology, Mathematics, Astronomy, Astrology, and etc.,

(d) To publish in Telugu standard works, both original and translations, dealing with all branches and schools of Medical science, Allopathy, Ayurveda, Unani, Siddha, Homeopathy, Naturopathy, and etc.,

(e) To publish in Telugu standard books, both original works and translations, dealing with Geography, History,-Ancient and modern, of India and of all countries of the world.

(f) To publish in Telugu standard books, both original works and translations, dealing with philosophy and religion of all different schools of thought, both ancient and modern.

(g) To publish in Telugu standard books, both original works and translations dealing with Politics, Economics, sociology and including works dealing with the uplift of Harijans and other backward communities and etc., of all different schools of thought, both ancient and modern.

# స్వాతంత్ర్య కుసుమమాల అప్లికేషన్ ఫారం

'స్వాతంత్ర్య కుసుమమాల' సెక్రటరీగార్కి

ఆర్యా

నన్ను మీ స్వాతంత్ర్య కుసుమమాల గ్రంథమాలకు—

| | | | |
|---|---|---|---|
| మహారాజపోషకులుగ | సం॥కు | రూ 116 | లు |
| రాజపోషకులుగ | ,, | 25 | ,, |
| పోషకులుగ | ,, | 15 | ,, |
| సభ్యులుగ | ,, | 10 | ,, |

చొప్పున జేర్పించవలెనని కోరుచున్నాను. సంవత్సర చందా M. O. / చెక్కు గా పంపుచున్నాను.

సంతకము

ఎడ్రెసు

చేర్పించినవారి సంతకము.

నంబరు. 4 ౨ ౨

# శ్రీ గాంధీ భారతము అప్లికేషన్ ఫారం

## స్వాతంత్ర్య కుసుమమాల సెక్రటరీగారికి

ఆర్యా,

మీరు, మీ స్వాతంత్ర్య కుసుమమాలయందు ప్రచురించుచున్నట్టి శ్రీ గాంధీ భారతము 8 భాగములకు నన్ను

మహారాజపోషకులుగ రూ 116-0-0

రాజపోషకులుగ 25 0-0

పోషకులుగ 15-0-0

చేర్పింప కోరుచున్నాను. మీకు పంపవలసిన మొత్తము సంతను / లో

రూ ను ఈ అప్లికేషన్‌తో M. O / చెక్కు గా పంపుచున్నాను.

మిగిలిన రూ మీరు రెండవ భాగము పంపునపుడు వి. పి. గా పంపించండి.

[అంతా పంపిన చివర వాక్యము కొట్టివేయుడు]

సంతకము

చేర్పించినవారి సంతకము.

(h) To take steps for improvement in culture of ancient indigenous arts of India—Music and Natya of all varieties that have an abiding value so as to present them to modern times in an appropriate manner.

(i) To publish all such other kinds of works as will conduce to the better culture of Andhra language in all its manifold manifestations.

(j) To publish standard works on all the above subjects useful to the High School and College Classes, post collegiate and research activities of scholars.

(k) To publish books of the same nature as referred to above, some times in English & Hindi and Sanskrit or in any other language as and when occasion requires such publications not to be more than 20% of the total publications both in number and size taken together.

(l) To publish periodicals dealing with one or all of the above subjects.

(m) To buy copyright from authors of all such books as referred to above with an eye to publication and raising the status of Telugu language and literature.

(n) To publish Diaries, Panchangams, Calendars, Note books, Cash books, useful for all professions, Engineers, Lawyers and Doctors etc.,



# గాంధీ భారతము



**అభిప్రాయము : పింగళి లక్ష్మీకాంతం యం. ఏ. గారు**
ఆంధ్ర యూనివర్సిటీ ఆంధ్ర రిసర్చి స్కాలర్ & Ex. Head of the Andhra Language Department.



నా మిత్రుడు, డాక్టరు శ్రీ మరంగంటి శేషాచార్యులుగారు గాంధీ భారతమనుపేర వ్రాయబూనిన మహాత్ముని పవిత్ర జీవిత చరిత్రలో ప్రస్తుతము అచ్చుపడిన నిర్యాణభాగములోని ప్రథమాశ్వాసమును శ్రద్ధమై చదివితిని. లోకపావనమైన గాంధీజీ చరిత్ర, యించుమించు మన జాతిలో, ద్వాపరాంతమున జరిగిన భారత చరిత్రవంటిది. అది యెంత మహోదారమో, ఇదియు నంత మహోదారము. అది యెట్టి ధర్మాధర్మ సంఘర్షణమో, ఇదియు నట్టి ధర్మాధర్మ సంఘర్షణము. ఆ యుద్ధములో ధర్మపక్షమున శ్రీకృష్ణుడు నియంత. ఈ యుద్ధములో గాంధీజీ నియంత. ఇక కొలదికాలములో మహాత్మునిగూడ అవతారపురుషునిగా వర్ణించుచు, కావ్యములు, పురాణములు వెలువడు సూచనలు పొడగట్టుచున్నవి. ఏమో, ఎవ్వరెరుగుదురు, పూర్వకాలమునాటి యవతారపురుషులు గూడ నిట్టి మహాత్ములేనేమో!

ఇట్టి మహనీయుని చరిత్ర వ్రాయుట పుణ్యమును, పురుషార్థమును అనెడి భక్తిభావముతో నా మిత్రుడీ రచనకు నుపక్రమించి యుండును. అంతేగాని, కవియశఃకాంక్షచే గాదనుట స్పష్టము. మొదటినుండియు మహాత్మునియెడ అవ్యాజభక్తి నెరపిన నిష్కళంకపు కాంగ్రెసువాది గనుక, ఈయనకు ఈతలంపు గల్గుట వింత గాదు. అసలు గాంధీజీనిగురించి ప్రసంగించుటకుగాని, ఏమేని వ్రాయుటకుగాని యిట్టి సాధుశీలురే యర్హులు. ఈ గ్రంథమును

మరకాగితముమీదగాక, చేతికాగితముమీద అచ్చువేయుట మరింత పవిత్రముగా నున్నది. పవిత్రమైన చరిత్ర, పవిత్రమైన కవి హృదయము, పవిత్రమైన కాగితము— ఇంతకంటె వాంఛనీయ మేమి కలదు ? నా మిత్రుడు అచిరకాలములో గ్రంథమంతయు పూర్తి చేయునని ఆశించుచున్నాను. లోకము ఈయన సత్సంకల్పమును ఆమోదించునుగాక.

వాల్తేరు R. S.
27-2-1949.

పింగళి లక్ష్మీకాంతం.

★

# విషయసూచిక

# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 10 | నిచ్చట | నిచ్చలు |
| 4 | 7 | నాడో | వాఁడో |
| 9 | 15 | బెట్టకొనియెడ | బెట్టుకొనియెడ్త |
| 10 | 14 | నీయడన్ | నీమెడన్ |
| 12 | 8 | పత్తందె | వత్తదెం |
| ,, | 27 | రిజత్ర | జరిత్రి |
| 15 | 10 | భావముపీడెన | నభావముపీడ |
| 15 | 13 | | క్వాయిదే అజాము జిన్నా విచారము |
| 19 | 15 | గయుప | గవుటుప |
| 20 | 13 | నేశ్పడు | నేర్పడు |
| ,, | 24 | డేర్పు | దేర్పు |
| 21 | 22 | నయ్యెని | నయ్యెవి |
| 22 | 1 | శుభ | శుభ్రి |
| ,, | 15 | పరము | బరమ |
| 24 | 1 | నదియు | నదిన |
| ,, | 5 | నచరి | నచ్చరి |
| ,, | 20 | తోఁచ | దోఁచ |
| 25 | 11 | జల్యాగు | జెల్యాగు |
| 28 | 15 | 6నము | వినమ్రి |
| 30 | 1 | మదవ | తసవ |
| ,, | 2 | అవినిన | లలినిన |
| ,, | ,, | ఔబువు | ఔరువు |
| ,, | 5 | కలసైత | కలసైన |

| | | | |
|---|---|---|---|
| 31 | 17 | నలీన | నవీన |
| 32 | 13 | జనులు | జనుల |
| ,, | 17 | వథాను | పథాను |
| ,, | 26 | తేప్టితీ | తేప్టిదీ |
| 33 | 22 | మానవ | మానస |
| 37 | 1 | బుచ్చి | పుచ్చి |
| ,, | 19 | పూర్తిగా | పూర్తి |
| 38 | 7 | సధ్వీధి | సద్వీధి |
| ,, | 18 | నిలువనీలచి | నిలిచి |
| 39 | 9 | త్రిదయ | త్రితయ |
| ,, | 25 | రాగిచ్ఛటల్ | రాగ్నిచ్ఛటల్ |
| 40 | 7 | తెలంజా | తెల్లంజా |
| ,, | 22 | శాయో—శక్తిశ | శక్తియో—శాశ |
| 41 | 1 | భాష్ప | బాష్ప |
| ,, | 13 | తంబాభావి | శామానోర్వి |
| ,, | 14 | తివ్వేల్గు | తిన్వేల్గు |
| ,, | 18 | ల్బాబ్లెప్డిఙ | ల్బాబ్లెచ్డిఙ |
| ,, | 25 | పనాద | విశేష |
| ,, | 26 | వరతవిశ్రి | వరవిశ్రి |
| 42 | 4 | నింపు | నేర్పు |
| ,, | 9 | వృత్తుడి | వృత్తియి |
| ,, | 16 | బుర్వ్రిర్ | బుర్వ్రిఙ |
| 43 | 16 | భాష్పజ | బాష్పము |
| 44 | 21 | నయస్సు | పయస్సు |
| ,, | 24 | డైరి | డైన |
| 46 | 15 | నునుచె | నునిచె |
| ,, | 16 | మహాత్ము | మహాత్మ |

| | | | |
|---|---|---|---|
| 46 | 19 | యామునా | గ్రోలనా |
| 47 | 19 | నోషిన | నోచిన |
| ,, | 21 | లుర్సక | లుత్సుక |
| ,, | 26 | యత్రూదగుం | యత్తుందగు |
| 49 | 6 | పొర్కు | యార్చు |
| ,, | ,, | రేగిడ్ల | రేగెడ్ల |
| ,, | 11 | హైదవ | హైందవ |
| ,, | 13 | వాసుని | దాసుని |
| ,, | 19 | మంత్రి | మంత్రు |
| 51 | 13 | బొట | బొట్ట |
| ,, | 22 | ద్రోర్కొ | దొర్కొ |
| 52 | 8 | మర్ధింతా | మర్ధితా |
| 53 | 9 | దెప్పు | దెప్పుడు |
| ,, | ,, | వారమా | వారమో |
| ,, | 24 | కందువు | కందవు |



## స్వాతంత్ర్య కుసుమమాల

### నాలుగవ కుసుమము

## శ్రీ గాంధీ భారతము

[శైశవ, దక్షిణాఫ్రికా పర్వములు.]

శ్రీ గాంధీజయంతికి తయారగును.

శైశవ పర్వమునందు 1857 ప్రథమ స్వతంత్రయుద్ధ వర్ణనము, దక్షిణాఫ్రికా పర్వమునందు శ్రీ గోఖ్లే, పోలక్, ఫాదర్ ఎండ్రూస్, టాల్‌స్టాయి, లోకమాన్య మొదలైనవారి యుపాఖ్యానములు రమణీయముగ వర్ణించబడును.

మెంబర్లకు ఖరీదు రు 2-0-0

ఇతరులకు 2-8-0

---

ఆంధ్రులారా,

ఆంధ్రభాషాసేవ చేయ నుత్సాహపడుచున్న స్వతంత్ర కుసుమ మాల పోషకులలో మీ నామాక్షరము లలంకరించుచున్నవా? లేకున్న సత్వరమే మీ నామాక్షరముల స్వాతంత్ర్య కుసుమమాల అప్లికేషన్ ఫారంనందు లిఖింప త్వరపడుడు.

డాక్టర్ వు॥ శేషాచార్యులు L. M. & S.
సెక్రటరీ, స్వాతంత్ర్య కుసుమమాల
మచిలీపట్నం



పుష్పామోదా వివయుతౌ !

నౌమిసద్గుణ ।

కస్తూరి



దేశకల్యాణ కాంక్షౌ ।
వి భ్రాజౌ ॥

గాంధి దంపతీ

### శ్రీ గాంధీ మహాత్ముడు

# గీతాదర్శిత స్థితప్రజ్ఞుడు



భగవద్గీతయందు వర్ణింపబడిన యీ లక్షణముల చేకూరిని యవి మహాత్మునియం దెట్లు వర్తించునో యీక్రింద సాంఖ్యయోగము శ్లో॥ 54 మొ॥ 72 వరకు సూచించుచున్నాము :—

అర్జున ఉవాచ :–

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ 54

అర్జునుడు :–

స్థితప్రజ్ఞుడేమి మాట్లాడును ? ఆయన మనోసమాధి యెట్టిది? ఆయన యేమి మెచ్చుకొనును? ఎట్లు కూర్చుండవలెను? ఎట్లు తిరుగవలెను?

శ్రీకృష్ణభగవాన్ ఉవాచ :

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాఽఽత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥ 55

కృష్ణుడు :–

మనస్సులో నుండునటువంటి కోరికల నన్నిటిని సంపూర్ణముగా వదలి, తన యాత్మయందే, తన యాత్మచేతనే తృప్తుడై యెవ డుండునో వాడే స్థితప్రజ్ఞుడు.

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥ 56

దుఃఖములయందు మనస్సేమియు చలింపక, సుఖములయందు తనను మరచిపోక, ప్రేమను, భయమును, క్రోధమును వదలిపెట్టు వాడే స్థితప్రజ్ఞుడు. వానినే మునియని చెప్పుచున్నారు.

ఉదా॥ దక్షిణాఫ్రికాయందు తెల్లవారు మహాత్ముని చుట్టుముట్టి కొట్టి అవమానములను చేయుట, ఇంగ్లీషు గవర్నమెంటనిన భయము వదలుమనుట, చౌరాచౌరా యుదంతముల అనంతరమున్నరీతి, నవఖాలీలో ఒక్కడే తిరుగుట.

యస్సర్వత్రా౽నభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

ఎవ్వరు దేనియందును స్నేహములేక శుభముగాని యశుభము గాని ఏది కల్గిన దానిని, సంతోషభావమును లేక, ద్వేషమును లేక, సమస్థితిలో ననుభవించునో వాడే స్థితప్రజ్ఞుడు.

ఉదా॥ భార్య కస్తూరిబాయి, ఆశ్రమమునందు కొద్ది డబ్బును దాచుకొనినదని దండించుట. తన యిష్టమునకు వ్యతిరేకముగా స్వరాజ్యపార్టీ పుట్టినపుడు, తన బుద్ధికి వ్యతిరేకముగా హిందూదేశ విభజనకు నాయకులు ఒప్పుకొనినపుడు, వారితో పూర్వరీతినే వర్తించుట.

యదాసంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా। 58

ఏరీతిని తాబేలు దాని యంగములన్నిటిని, అవసరమైనటుల ముడుచుకొని వర్తించునో, అవిధముగనే యింద్రియములన్నిటిని, అవి వర్తించు నింద్రియార్థములలో దగులక ప్రవర్తించుటయందే వాని ప్రజ్ఞయున్నది.

ఉదా॥ క్లిష్టమైన సమస్యల నాలోచించునపుడు, పదినిమిషములు విశ్రాంతి తీసుకొనెదనని, అందరికి నాశ్చర్యము గలుగునట్లు అర నిమిషములో నిద్రపోవుటయు, నియమించుకొనిన 10 నిమిషములు కాగానే, నిద్రలేచి, తీక్ష్ణబుద్ధితో తాము వదలిన చోటునుండి

మాట్లాడ మొదలిడుటయు ఆయనతో సంపర్కము గలవారికందరకు తెలిసినదే.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జంరసోఽప్యస్య పరందృష్ట్వానివర్తతే॥ 59

ఆహారము మానివేయుటచే, కోరికలకు కారణమైన వస్తువులను వదులుచున్నారుగాని, వానిమీద ప్రేమ వదలుటలేదు. వాని మీద ప్రేమ, ఈ క్షుద్ర బాహ్యవస్తుప్రేమకంటె నుత్తమమైన దానిమీద ప్రేమకలిగినపుడు వదులుచున్నారు.

ఉదా॥ ప్రాకృతసహజమైన కోర్కెలను మహాత్ముని మనస్సు మానవప్రేమానిమగ్నమైన సేవయందు మరచెను.

శ్లో॥ యతతోహ్యపి కౌంతేయ । పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని । హరంతి ప్రసభంమనః॥ 60

ఎంత ప్రయత్నము చేసినను, ఏమరియున్నవాని మనస్సును, నింద్రియములు, బహు వేగముగా తమ వైపునకు లాగివేయుచున్నవి

ఉదా॥ మహాత్ముని చిన్నతనమునందలి బ్రహ్మచర్య ప్రయత్నములు, మాంసభక్షణ ప్రయత్నములు.

శ్లో॥ తాని సర్వాణిసంయమ్య । యుక్త ఆసీత మత్పరః ।
వశేహియస్యేంద్రియాణి । తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

ఎవ్వడు, అట్టి యింద్రియము లన్నిటిని స్వాధీనమునం దుంచుకొని, నాయందే మనస్సును నిల్పుచున్నాడో, వాడే స్థితప్రజ్ఞుడు.

ఉదా॥ మహారాజుల యిళ్ళకు వెళ్ళినను, మహాత్ముడు తన ఆహార, పాన పద్ధతులను, మహాత్ముడైనతరువాత మార్చుకొనలేదు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస । స్సంగస్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామం । కామాత్క్రోధోభిజాయతే॥ 62

శ్లో॥ క్రోధాద్భవతిసమ్మోహః । సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో । బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ 63

ఇంద్రియ సుఖములమీద ఆలోచననిల్పిన, వానిమీద రాగము సంగము ఏర్పడుచున్నది; ఈ సంగమునుండి కామము, కామము ఫలింపనపుడు

క్రోధము; ఆక్రోధమువలన మోహము; దానివలన జ్ఞాపకము తబ్బిబ్బగుచున్నది; ఈ తబ్బిబ్బులవల్లను బుద్ధి నాశనమగుచున్నది; ఆ బుద్ధి నశించుటచే సర్వనాశన మగుచున్నది.

ఉదా॥ ఇంద్రియ లోలత్వమున నాశనమైనవారి చరిత్రలు; గాంధీమహాత్ముని చరిత్రియందు దీనికి వ్యతిరేక మార్గమున బుద్ధి వికాసము కల్గిన మార్గము స్ఫురించుచున్నది. ఇంద్రియ సుఖముల మీద విముఖతవలన, సంగము తగ్గినది — దాని మూలమున కామము పోయినది: అందుచే క్రోధము తగ్గినది— దాని తరువాత మేధోధారణ వృద్ధియైనది: తదనంతరము బుద్ధి విశేషముగా వికసించినది; బుద్ధివికాసము మూలమున మహాత్ముడగుటకు మార్గదర్శకుడయ్యెను.

శ్లో॥ రాగద్వేష విముక్తైస్తు । విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మ । ప్రసాదమధిగచ్ఛతి॥ 64

ఎవ్వడు రాగద్వేషములు లేక, విషయములయందు, నింద్రియములను చరింప జేసినప్పటికి, ఆత్మను వశమునందుంచి, దాని విధేయతలో వశములో నుంచుకొను చున్నాడో, వాడు ఈశ్వర ప్రసాదమును పొందుచున్నాడు.

ఉదా॥ రాగద్వేషములను వదలి, సామాన్య మానవుడు గడపు సర్వజీవిత వ్యాపారమును, మహాత్ముడు హత్యగావింపబడు నంత వరకు చేయుచునే యున్నాడు.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం । హాని, రస్యోపజాయతే ।
ప్రసన్న చేతసోహ్యాసు । బుద్ధిః పర్యవతిష్ఠతి॥ 65

అట్టి ప్రసాదమును పొందినవానికి, సర్వదుఃఖములవలని హాని, పోవుచున్నది— ఆ దుఃఖములు వానికి హానిచేయలేవు. అట్టి ప్రసన్నమైన మనస్సుగలవానికి, బుద్ధివికాసము కల్గుచున్నది.

ఉదా॥ మహాత్ముడు తిన్నగ మాటలాడలేని బ్యారిష్టరుగా ఆరంభించి, ప్రపంచమున అద్వితీయ మనీషావిభాసితుడుగా నగుటకు, ఆయన ప్రతిరోజు కృషిచేసిన, రాగద్వేషము లుడిగి సమానముగా జీవనము గడుపజేసిన యమోఘ ప్రయత్నమే యేమో.

శ్లో॥ నాస్తిబుద్ధిరయుక్తస్య । నచాయుక్త స్యభావనా ।
నచాభావయతశ్శాంతి । రశాంతస్యకుతస్సుఖమ్॥ 66

శ్లో॥ ఇంద్రియాణాంహిచరతాం । యన్మనోఽనువిధీయతే ।
తదస్యహరతిప్రజ్ఞాం । వాయుర్నావమివాంభసి॥ 67

అట్టి సమత (సుఖదుఃఖముల సమత) లేనివారికి బుద్ధివికాసము లేదు. బుద్ధిలేకున్న, సమానభావన లేదు; భావన లేకున్న శాంతి లేదు. శాంతిలేకున్న నికసుఖమెక్కడ ? మరియు,

ఇంద్రియములయందు వర్తించుచు, ఎవ్వని మనమా యింద్రియములకు వశవర్తినియై యుండునో, ఆ ఇంద్రియములు వారియొక్క ప్రజ్ఞను, గాలి చిన్ననావను నీటిలో ముంచివేసినట్లు, ముంచి వేయును.

ఉదా॥ దుర్యోధనుడు, రోమన్ హిస్టరీలోని మార్కు ఏంటినీ, ఇతర స్వల్ప మానవు లసంఖ్యాకులు.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో । నిగృహీతానిసర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య । స్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥ 68

కాబట్టి యెవ్వడు తన యింద్రియార్థములకోసమై యింద్రియములయందు దాను చరించుచున్నను, ఆ యింద్రియములను తాను వశమునం దుంచుకొనుచున్నాడో, వాడె స్థితప్రజ్ఞుడని, యనంత దేహబల సంపన్నుడవైన నీవు తెలుసుకొనుము.

ఉదా॥ ఇంద్రియములను మహాత్ముడు వశమునందుంచుకొనుట విదితము.

శ్లో॥ యానిశా సర్వభూతానాం । తస్యాంజాగర్తిసంయమీ ।
యస్యాంజాగ్రతిభూతాని । సానిశాపశ్యతోమునేః॥ 69

సర్వభూతములును రాత్రి సమయములయందు నిద్రావశులై యున్నప్పుడు, మునియైనవాడు మేల్కొనియుండి, జ్ఞానవృద్ధిని బొందును. భూతములెల్లను మేల్కొని యింద్రియవశత వర్తించుచున్నపుడు ముని, దానిని రాత్రిగా బరిగణించి నిద్రించును.

ఉదా॥ మహాత్ముడు పగలు అప్పుడపుడు నిద్రించుటయు కలదు. తెల్లవారుజామున 3 గంటలకు లేచి దినకృత్యము లారంభించుటందరికి తెలిసినదే.

శ్లో॥ అపూర్యమాణమచలప్రతిష్టం ।
సముద్రమాపః ప్రవిశంతియద్వత్ ।
తద్వత్కామాయం ప్రవిశంతిసర్వే ।
సశాంతిమాప్నోతి నకామకామీ॥ 70

కొండలమీద గురియు వర్షజలము, సముద్రమున ప్రవేశించుచున్నప్పటికి, ఆ సముద్ర మేవిధముగ మారక యుండునో, ఆ విధముగనే లోక వ్యవహారములన్నియు స్థితప్రజ్ఞునియందు బ్రవేశించుచున్నవి. ఆయనమాత్రము మారక శాంతముగ నుండును. ఆ విధమైన శాంతిని, కామయుతుడు పొందడు.

ఉదా॥ లోకవ్యవహారములను, కష్టములను తీర్చినవుడు A.I. C.C. సమస్యలను తీర్చినవుడు మహాత్ముడు ద్వంద్వాతీతుడుగా నుండుట లోకవిదితము.

శ్లో॥ విహాయకామాన్ యస్సర్వాన్ । పుమాంశ్చరతి నిస్పృహః ।
నిర్మమో నిరహంకారః । సశాంతి మధిగచ్ఛతి॥ 71

కామమును కోరికలనువదలి, నిస్పృహుడై, మమకారమును,

అహంకారమును లేక, ఎవ్వడు సర్వమనుష్యులలోను చరించుచుం డునో, వాడు శాంతిని పొందుచున్నాడు.

ఉదా॥ ఈవిధముగ మహాత్మ గాంధి తన జీవితాంతములోని ముప్పది సంవత్సరములకుపైగ గడపెను.

శ్లో॥ ఏషాబ్రాహ్మీస్థితిః పార్థ । నైనాం ప్రాప్యవిముహ్యతి ।
స్థిత్వాఽస్యామంతకాలేపి । బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥ 72

అది బ్రాహ్మీస్థితి. దానిని పొందినవాడెవడు, తిరిగి జీవితవ్యామోహమునందు పడడు. ఈవిధముగనే చివరవరకుండిన అంత్యమునందు బ్రహ్మనిర్వాణమును పొందుచున్నాడు.

ఉదా॥ మహాత్మగాంధి పైవిధముగా జీవితము గడపి అంత్యమునందు సర్వపావనమైన "రామ" నామోచ్చారణంబుతో చనుటయందగుపించినదే. ఆ మహాత్ముడు నిర్వాణమొందకున్న...... నిఁక దాని కర్హులెవరు?



# శ్రీ గాంధి భారతము

## నిర్వాణ పర్వము.

—: శాంతాశ్రమ వర్ణన :—

క॥ శ్రీ గాంధి బోధనములను ।
నాగములనెల్ల యప్పు ♦ డధ్యాయనంబున్ !
బాగుగ నొనర్చువారలు ।
నాగరిక జనంబులొక్క ♦ నగరము నగగా ॥

చ॥ వెలసిరి శాంతసంస్థిత న ♦ వీనశుభాహ్వాయ మొప్పచుండగా ।
తొలగిరి సర్వమానవుల ♦ మీదను సోదర ప్రేమ జూపుచున్ ।
జలమున సర్వసన్నిధి ప ♦ చారములందు సమప్రవర్తితో ।
జెలగుచు శాంతనాముముప్రి ♦ చేతసభావము జూపుచుండగా ॥

ఉ॥ మానవులందు నెక్కుడగు ♦ మన్నన కొందరియందు జూపగా ।
బూనరు పుట్టుచేతను సు ♦ పూజ్యులెయాటను నందరామొదన్ ।
దానుగ జహ్వాశ్రమస్థను ని ♦ జంబుగ బావురసాలభూజమున్ ।
మానుగ వేపచెట్టును స ♦ మానజలాప్తి నార్తినొందవే ॥

ఉ॥ అందరు పాదముల్ గలిగి ♦ యున్నతలంబుల కేగి, లోపలన్ ।
గ్రిందుగ జ్ఞానశాంతులను ♦ గల్గిన యా పరమాత్మునంశలే ।
ముందుగు నావరోధముల ♦ మోహాగతిన్ సడలించుశక్తియుం ।
దెందో యొకింత భేదమగు ♦ నితంళునందరు దైవరూపులే ॥

చ॥ అనియెడు శావతత్పరత ♦ నందరు జాతిమతాదిభేదముల్ ।
గవకయె గాంధిజీపరమ ♦ కారుణికత్వవచః ప్రమత్తులై ।
దివడినమున్ బ్రశాంతియుత ♦ దివ్యసుజీవనయాత్ర తృప్తినుం ।
డమనట బూర్ణగ్రామపు ఘ ♦ నప్రతిరూప విశేషమేర్పడన్ ॥

సీ॥ తొలిజామునన్ భక్తి ♦ తోణుకాడ వైష్ణవ
జనతాది కీర్తనల్ ♦ చక్కబాడు।
పాడిమెల్లగ నల్ల ♦ పావనజలముల,
మలినంబు వెడలంగ ♦ జలకమాడు।
ఆడిబీదలపాలి ♦ యమరభూజంబైన,
రాట్నంబు శ్రద్ధదీ ♦ రంగదిప్పు।
త్రిప్పియుందరుగూడి ♦ తేటగామగ్గంబు,
నాడించి మడతిల ♦ నమరనేయు॥

తే॥ గీ॥ నేసి సాత్త్వికాహారము ♦ నియతిదినును।
తినినతర్వాత వార్తల ♦ వినగనేగు।
నేగి, రాత్రుల బడి, విద్య ♦ నెలమిజెప్పు।
జెప్పి కనులార నిద్రించు ♦ చెలిమినొకడు॥

చ॥ తనదు శరీరధారణకు ♦ ధాన్యధనంబు లవెంత యుక్తమో।
యనూపుగనంతమాత్రమె జనావలిచేకొని, శేషమెల్ల శా
యనునవిలేనివారి కన - యంబు నొసంగెదరర్థి; సేవయే।
మనుగడకూతయై చెలగి ♦ మంజులశోభ నెసంగదివ్వెనాఁ।

ఉ॥ నాయుది యిద్దియుంచెవడ ♦ నన్ బరమేశ్వరుదృష్టినందరున్।
బాయకతొక్క రూపమున ♦ వర్ధిలుచుండగ నెట్టులయ్యెడున్
సాయము ప్రాణిప్రాణికని ♦ నల్పెదరందరటన్ దరిద్రనా।
రాయణుసేవ; నొక్కహితు ♦ రంజిలజేసిన కృష్ణునవ్వచున్।

సీ॥ అందరు విప్రులే ♦ యాద్యాశ్రమంబున,
శమదమంబుల జ్ఞాన ♦ సమతనుంట।
అందరు క్షత్రియు ♦ లాయాశ్రమంబున,
స్వాతంత్ర్యసమరాన ♦ జతురులౌట।
అందరు వైశ్యులే ♦ యాయాశ్రమంబున,
సంపత్తుల వృద్ధి ♦ గావించుంట।

నందరుశూద్రులే ♦ యాయాశ్రమంబున
కష్టజీవన తత్త్వ ♦ కలననుంట ॥

తే॥ గీ॥ సత్యరతియును ధర్మప్ర ♦ చారబుద్ధి ।
హింసనెరుగని జీవిత ♦ హితచరిత్రి ।
గలిగి బాపూజీ యాదర్శ ♦ ములనుజాటు ।
యంత్రనిర్మాణ నిలయమా ♦ యాశ్రమంబు ॥

ఉ॥ అచ్చటి బాలబాలికల ♦ హంబును రాత్రియునల్లవేళలన్ ।
ముచ్చట భారతాంబికయు ♦ మోఘచరిత్ర బఠించుచుంటచే।
బొచ్చెములేని ప్రేమ పరి♦పూర్ణత నుందురుమాత్మనామమే।
నిచ్చట వాతెరల్ జెలగ ♦ నిస్తుల పుణ్యవిలాసలీలలల్ ॥

సీ॥ సద్గుణలతికలు ♦ చక్క వర్ధిలుతోట,
పుణ్యంపు నెలతకు ♦ బుట్టినిల్లు ।
జ్ఞానాగ్నికీలలు ♦ కాలుయజ్ఞపుభూమి,
సత్యసీరజమొప్పు ♦ సరసనరసి ।
ఔదార్యమారుత ♦ మలరెడు మలయంబు,
త్యాగజలంబుల ♦ కాశయంబు ।
పూతచారిత్రులు ♦ పొలుపారునిలయ, మా,
నందహంసల పిండు ♦ నాట్యసీమ ॥

తే॥ గీ॥ స్వేచ్ఛనెరజాణకరమున ♦ జెలగముకుర ।
మతుల శ్రీదేవిసవతిగా ♦ నడరుచుండు ।
శ్రేష్ఠసద్గుణయుక్త దా ♦ రిద్ర్యలక్ష్మి
కోలలను నవ్వుచుందురా ♦ బాలురచట ॥

ఉ॥ ఆశ్రమమధ్య మందులను ♦ నందరు సంజలసంతసంబుగా ॥
విశ్రమమొందుచుందురు, ప్రవీణులు గాయకశేఖరుల్వెసన్।
విశ్రుతమౌ కృతుల్వినుప ♦ పేశలశైలిని గానలోలురై ।
య[illegible] [illegible]గారగా విను[illegible] [illegible]రు రేసియొ రొక్కవేళ్ళ[illegible]

జెనటియెవండో చేసెనని, చిన్నలు మిన్నులుమీఁదబడ్డటుల్ ।
వనటనుబొంది యేడ్చిరట, వన్నెలు చిన్నెలుదీరనంతటన్ ॥

— ఆశ్రమ బాలబాలికా విలాపము —

క॥ మనముద్దుతాత, వీరుడు ।
మననాయకమాళినేత, మాన్యుడు ధీరుం ।
డనుపమశీలుడు సాధుడు ।
మనభారత తల్లివంట, మనకిక లేడా॥

క॥ అపకారికి నుపకారము ।
నెపమెన్నక చేసి చూపు, నేతగ గాంధీ ।
బాపూ కన్నుల బడడా ।
పాపంబిటు బ్రద్దలౌన, భారతజననీ ॥

క॥ ప్రేమయె జీవితధర్మము ।
ప్రేమయె కల్యాణపథము - ప్రియతమమనుచుం ।
బ్రేమను జీవమువిడచెన ! ।
రామా ! యని బాపుగాంధి - రమ్యప్రేమా

క॥ తల్లీ, పావనచరితుం ।
డుల్లము రంజిల్లజూచు - నుత్తమశీలుం ।
డెల్లరిపైనను బ్రేమను ।
జల్లెడు మాబాపు తండ్రి - చనెనేదిశకో ॥

క॥ మాయన్న మాగురుండును ।
మా యనుపమ శాంతిదూత - మహితాత్ముండున్ ।
మ యోధుడు మామంత్రియు ।
న య్యార్తత్రాతనేత - మము నిక గనడా ।

క॥ దక్షిణాఫ్రికాలో ।
శిబిరంబు పెట్టి - శితసాయకమా

నక్షయ శాంతాహవమును ।
లక్షణలక్ష్యముగజూపు- రాజిత దేశదా ॥ 25

క॥ అటచాంపరాను జనముల ।
కటకట లనుబాపుకొఱకు- గటిసూత్రింబుల్ ।
త్రుటిలోనదాల్చె నెవ్వడు ।
పటుతర విక్రమ మెసంగ- ధానము పొంగన్ ॥

క॥ కనబాఱిన చీకటిగా ।
ర్చిన హీనతలోగలంగు- చెనటులకెల్లన్ ।
వినుత స్వేచ్ఛాదీపిక ।
నొనగూరిచి కాంతినొసగు- నూర్జితుడితడే ॥

క॥ పైపైనపూత మెఱుగుల ।
దీపించు ప్రతీచివిద్దె తెఱవకువశులై ।
మాపూర్వఘనత మఱచిన ।
పాపాత్ముల దృష్టిపథము - బాపినదితడే ॥

క॥ సత్యమహింసయు దలపగ ।
నిత్యము వేదాంతధర్మ- నిలయములనుచున్ ।
వ్యత్యస్తజీవితులకు న ।
గత్యం బవిరెండటంచు- గఱపినదితడే ॥

క॥ కైరాజనములు కాటక ।
భయమున సుంకంబులేక- పాఱినవారిన్ ।
స్వయముగ ధైర్యముగఱపుచు ।
జయమిచ్చిన శాంతిసేన- సామియితండే ॥ 30

క॥ జనములసాయము లేకయె ।
మననేరదు సైన్యబలము- నృపతికున్నన్ ।
గనుక నసహాయపద్ధతి ।
జనుడసి స్వాతంత్ర్యపథము- జాటినదితడే ॥

క॥ పాపపుభీతి యెఱుంగక।
యేపునలోకంబునెల్ల- నేలుచుధర్మం।
బోపని రాక్షసరాజ్యము।
నూపిన యాసూత్మ తాప- సోత్తముడితడే॥

క॥ ధనమొక పురుషార్థముకా।
దనయవసరములనమించు- ధనమునెవండే।
నొసగును దరిద్రినారా।
యణసేవకునై యొసంగ-ననినదితండే॥

క॥ మనసిజు గెలిచితిమనుచును।
వనముల వాసంబు జేయు- వాసియు దేయా।
యనుచును సంసారంబున।
మనుచుండియు లోకసేవ-మలగినదితడే॥

క॥ పదివేలయుదువులొక్కట।
నెదురుగ కృష్ణుండొకండె- యీడైయొప్పెన్।
పదియును ముప్పదికోటుల।
యెదలను వెలుగొందెగాంధి- యెనలేనిప్రభన్ 35

సీ॥ ఆత్మగౌరవహీన • మగు దీనమనముల,
నాభిజాత్యమునాటె • నధికశక్తి।
స్వార్థపరాయణ • స్వాతంత్ర్యరహితుల,
సేచ్ఛానురక్తుల • జేసెయుక్తి।
ఐశ్వర్యమదమున • నడరెడుధనికుల,
నేస్నష్టజీవుల • నేర్చరక్తి
మూర్ధాభిషిక్తుల • మోహితస్వాంతుల,
గాజేసె సత్యవా • గ్జాలదీప్తి

తే॥ గీ॥ పిరికిపందల నబలల • భీరువులను।
వెక్కుచెదరని వీరుల • శ్రేణిజేసె।

ఎత్తైమాణిక్యసంతతి ♦ మృత్తునుంచి।
మఱపురాడే మహాత్ముండు ♦ మాకు నెపుడు॥

సీ॥ పరదేశయంత్రాల ♦ స్వాధీనులగువారి
వడుకురాటంబుల ♦ వైపుద్రిప్పి।
పాశ్చాత్య విద్యాభి ♦ భవమైనదృష్టిని
జాతీయవిద్యపై ♦ జనగజేసె।
వృత్తులుపోయిన ♦ విత్తవిహీనుల,
కయిపల్లె కయిపనుల్ ♦ కలుగజేసె।
ఉల్లాసముగ దేశ ♦ కల్లోలముల జూచు,
దుర్మార్గనేతల ♦ దొలగద్రోచె॥

తే॥ గీ॥ నెలుకపైపిల్లి బిల్లిపై ♦ నెలుకదించి।
జాతిలోపలికలతల ♦ సరణిమాన్పె।
నరయ నీశౌర్య శూరత ♦ మఱువగలమె।
మఱపురావన్న శ్రీగాంధి ♦ మా కునీవు॥

సీ॥ వేదాంతమణిరాశి ♦ విమలకాంతులగప్పి,
ప్రాచీనభాష్యార్థ ♦ రజముబాప।
గుణతత్త్వమూలమౌ ♦ కుజము చాతుర్వర్ణ్య,
మనుభావమున్నన్నా ♦ తనులకీయ।
పశుబలదుర్వార ♦ పర్వతకులిశంబు,
ధర్మంబు పాశ్చాత్య ♦ తతికినీయ
పారతంత్ర్యభీల ♦ ఫణిరాజగారుడం,
బీ ప్రేమమాహాత్మ్య♦ మెఱుగజేయ।

తే॥ గీ॥ గలినిటవతారకాండన ♦ కల్కిమూర్తి।
కోపసమవర్తి శాంతసా ♦ ద్గుణ్యమూర్తి।
సత్యమాధుర్య మోహిత ♦ సాధుకీర్తి।
మముల విడనాడిపోయితే ♦ మాన్యమూర్తి॥

క॥ ఆ శీలం బా తేజం
బా శుద్ధాంతఃకరణము ♦ నా త్యాగంబా
యాకారహితత దక్షత
యా శత్రువిహీనతత్వ ♦ మన్యుల గలదే॥

గీ॥ అనుచు గాంధీమహాత్ముని ♦ యమల సుగుణ
వైభవస్తోత్ర కలనను ♦ వఱల గడపి
యంత దనివినొందక వేగ ♦ మతని జంపు
హంతకుని గూర్చి జనులిట్టు ♦ లనిరి వంత॥ 40

—♦ హంతక దూషణ ♦—

చ॥ అరనిముసంబులోనను న♦ యాంబురుహాక్షుని కన్నుమూయగా
గరకరి చేసినాడవుర ♦ దుష్టుడ! దుర్మద! నీడనొడ్డకుణ్
దిరముగ నిచ్చు చున్నదని ♦ తియ్యరసాలము చేతులార నే
నరకితి వేమిపాపము వి ♦ నాయక తమ్ముడ బుద్ధిహీనుడా॥

ఉ॥ తల్లిని దండ్రిబిడ్డలను ♦ దారగుణాలయ భార్య బంధులిం
కెల్లర బొట్టుబెట్టకొని ♦ యేడ్చెరబోరములాడు ద్రోహులన్।
జల్లనివృక్కాంతులను ♦ జల్లియపారశమంబు జూపగా।
నుల్లము కూరతదొలగ ♦ నుసుమటన్నను సైపవైతివే॥

ఉ॥ చేసితిబోఘనులవినియు ♦ నీయనుకూరపుగార్యమీయెడన్।
బూసినదివ్య పుష్పమయు ♦ భూజము నేటునగూల్చితీయెడన్।
వేసిన సత్యప్రేమలను ♦ పిందెలవన్నియునన్ని తావులన్।
వాసియువన్నెగాంచుతతి ♦ వాడగ జేసితి వేల పాపుడా॥

ఉ॥ అంచితకాంతివంతమయి ♦ యబ్జసమానవిలాసయుక్తమై।
మించెడి సౌధరాజమగు ♦ మేల్మికడానిహారరంగళీనున।
భ్యంచిత 'టాజి' యాయనగ ♦ భాసిలుహార్మ్యము జ్ఞానలోకమం।
దెంచక స్తంభవక్రితకు ♦ నీవిధి సౌధవినాశమెంచెదే॥

ఉ॥ ఇంతవిశాల భూమిపయి ♦ నించుకపాలనుదావి పళ్ళనో।
క్రాంత మొసంగి లోకముల ♦ గీసులడంగను శాంతిగీతికల్।

చింతలబాపబాపుకడు ♦ చెన్నగు కీరకిశోరి నెట్టులన్।
వింతగగోరి కొట్టితివి ♦ వీర్యమె! నీమది చల్లనాయెనే॥ 45

ఉ॥ ఎప్పుడు నిన్ను జూడడలె ♦ యించుకయామ్యగుశిశుదృష్టులన్
విప్పుచు నీశరీరమును ♦ వీక్షణ చేసిన నీదుచేరితో।
నిప్పగిడిన్ నిశాచరుల ♦ కీడగుకార్యము చేయనేర్తువే?।
మెప్పున నీదుచిత్తమది ♦ మెల్లన నీరయి పాఱకుండునే!॥

ఉ॥ శత్రులు లేరు నాకనుచు ♦ సర్వజనంబుల నొక్కరీతిగా।
మిత్రితజూపి వైరులప ♦ మేయకృపాంబుధిపోలలాడ న।
న్మిత్రులజేయునీగురుని ♦ ప్రేమపరీవాహములోమునింగి లో।
కత్రియపూజ్యునిన్గురుణ ♦ గాచెడివానిని దుంచినాడవే॥

ఉ॥ తన్ను వరించివచ్చు వధు ♦ తన్వులస్మేరవిలాసలాలనన్।
మన్ననజేసితన్వనట ♦ మానవదేహము కృష్ణుడయ్యెడన్।
గ్రన్నన క్రూరశత్రులని ♦ కారములంగనుపూరుపావళిన్।
దిన్నని సత్యవాక్యముల ♦ దిద్ది మహాత్ముడు వెల్గునీయుడని।

చ॥ ఎఱుగక చేసినాడవుర ♦ యీభువి దేహము లేకయున్నచో।
దఱుగని దేశదేశముల ♦ ధన్యుడు గాంధి ప్రబోధశక్తితో।
చిరముగజల్లిపోయినయు ♦ దీర్ఘకృపాప్తియు సత్యరక్తియున్।
దరతరముల్ ఫలించుటలు ♦ దారపుసస్యపరంపరావళుల్॥

ఉ॥ ఎన్ని దినంబులాయెనొకో ♦ యింతిని రాజ్యముబాసి బాధతే।
యున్నరలోకమందెచట ♦ నెందు వదృశ్యమొ సర్వగంకణం।
బున్నతిగట్టుబుద్ధుడట ♦ బోధిమహీజపు జాయబల్కగా।
నన్నియునీతరిన్ మరల ♦ నల్లననీరికలెత్తగాంచవే॥ 50

శా॥ ఏదో దేశమునందు నెచ్చటనో యెం ♦ తేదుష్టపంకంబునన్।
పైదోడేదును లేక కష్టగనగ ♦ ష్టాలెన్నియో యోర్చియున్।
వేదవాగ్విభవసూక్తిదీపిక భువిన్ ♦ వెల్గించుసత్కీర్తి సం।
పాదిన్క్రీస్తునిసిల్వచావెయడగిం ♦ పంజాలెనే చూడుమా॥

చ॥ చదువొకయింత లేకయును ♦ శక్తిపదాంబుజ పూజసల్పిలో|
విదితగతిం దదంబకృప ♦ వేషముదాలిచి ధ్యానరక్తుచే|
నుదితసమస్త వేదియగు ♦ నుజ్జ్వలధీమణి రామకృష్ణుడే|
యదియరయంగ సద్గురుయ ♦ యాత్మవివేకము చాటడేదిశల్

మ॥ అదెయాకాశమునందునిన్గనుచు ♦ నాహా! యింత యేనా? త్వదీ|
యదయాహీనసహింసమార్గబలమ ♦ య్యాయంము గేలించునా|
సుదయాసాంద్రుని బాపూజీగ సవానో ♦ శుభ్రాంశురాగద్యుతుల్|
విదళింపన్ వెలుగొందె నిర్మలతపో ♦ విద్యావిరాజత్ప్రభన్॥

చ॥ జడము యి ఘుర్ఘరంబనను ♦ సార విహీనపు డొక్క తేరు నీ|
యెడనజరంబు, సారమయ ♦ మెన్నన నామయసత్యప్రేమలో
క్కడబరవన్ సహింపదని ♦ యిచ్చితె తెమ్ముడ సూక్ష్మదేహమీ
వనుగునకంచు నల్లదియె ♦ వందనమిచ్చెదు బోసినవ్వుతో|

శా॥ హా రామా యని నీరివాల్వరు ధ్వనిన్ ♦ వ్యాకీర్ణమై గాంధిజీ
నోనారన్ దగ నీహృదంతరమునం ♦ దున్వాల్గు చిద్రూపునిన్
స్ఫారోదారతటిల్లతాయుతవిరా ♦ జన్నీలమేఘాకృతిన్
పేరం బిల్చుచునయ్యె లీనమటు త ♦ త్ప్రేమానుసంధానతన్ |

ఉ॥ కోపముచేత గొట్టితివి ♦ కొంకక దానఫలించెనేమి? సం|
తాపము నీకుదక్క నిక ♦ ధారుణియుండెడి యంతదాక నీ
పాపము గర్వ్యమాఁకను ♦ భారతజాతి శిరంబు నెత్తగా|
నోపదుగా; యికైనగదు ♦ నొప్పెడియాత్మబలంబెఱుంగుమా

తే॥గీ॥ అనుచు నీరీతి వాపోయి ♦ యధికదుఃఖ
వీచికంబులోన మదితప్పి ♦ విహ్వాలులయి
తేలువారికి రేడియో ♦ తీరములను
మృదులరవమిట్లు వినవచ్చె ♦ మదులు కరుగ॥

వ॥ బ్రిటిషుచక్రవర్తి హిందూదేశ గవర్నరుజలరల్ లార్డుమౌంటు బాటనునకిట్లు సందేశ మురికించె.

ఆ॥వె॥ రాణి నేను మిగుల ♦ రట్టును జెందితి
మనుచు తెలుపు సకల ♦ హైందవులకు
మీవిపత్తొందెచ ♦ మేరయే లేని
మీకియనగనేల ♦ లోకమునకె॥

వ॥ బ్రిటీషు మంత్రిశేఖరుడైన అట్లీ రేడియోయందు దుఃఖించుచు నిట్లు ప్రసంగించెను.

సీ॥ హిందు దేశమునందు ♦ హితము మీఱ జపించి
యఖిల దేశముల మ ♦ హాత్ముఁడనఁగ
ఖ్యాతిని గడియించి ♦ యతిబోలె తపమున
నింద్రియనిగ్రహ ♦ మొసఁగ వెలసి
రాజకీయములందు ♦ రాజితసన్మార్గ
వర్తనసత్యంబు ♦ వఱలఁజేసి
హింసావిహీనమై ♦ యేపార నీశాంతి
సంగరపథము లె ♦ ఱుఁగఁ జేసి
తే॥గీ॥ శత్రులను బ్రేమ మచ్చున ♦ మిత్రులనుగ
జేసి, జగమున లోకవింత ♦ చెలువు గూర్చి
యొక్క తరమెల్ల నేతయై ♦ యున్నవాని
మఱువగలదెట్లు గాంధిని ♦ భరత భూమి

ఉ॥ అన్యుల పాలనంబునకు ♦ నొదలవంపములంచు బల్కు సా
మాన్యుల వీరవర్యులుగ ♦ మార్చెను. బ్రాచిబ్రతీచిపద్ధతిన్
మాన్యత బోనడంచెను ♦ గ్రమంబుగ నింద్రియలోలురన్దరన్
ధన్యుల జేసె జీవనవి ♦ ధానము దిద్ది ప్రయత్నమేర్పడన్

—♦కలకత్తా నవకాలీ యుదంతములు♦—

ఉ॥ జాతిని జాతికార్యమున ♦ జావగనేసె విశుద్ధజీవన
ప్రీతిని వీడి రాక్షసుల ♦ పేర్మి నధోగతి వంగదేశమున్
నీతిని బాసియున్నతటి ♦ నేర్పున జీవములొడ్డి వారి నే
రీతిని గాచిబ్రోచి విప ♦ రీతము మాన్చెరిజాత్రిచాటెదన్ ॥ 60

ఉ॥ ఆమధురస్వరంబు తగు ♦ నాశుభవామన దేహముంగటా।
నీసుము లేని హంతకుడు ♦ నెమ్మి రివాల్వరు బారిగూర్చగా।
నామహనీయు నాత్మయును ♦ నంచితవర్తన దీపమట్టిలన్।
క్షేమముగార్చి హైందవుల ♦ చీకటిరాత్రులదారిజూపుతన్॥

వ॥ అనంతరం గాంగేయ యుద్ధకాలమంత్రి విన్సటన్ చర్చిల్ పత్రికా విలేఖరులతో నిట్లు ప్రసంగించెను.

ఉ॥ దేహమునర్ధవస్త్రమున ♦ దీరగుచ్ఛస్త్రమునైనదాల్చకే।
యూహాలనాడో, నాముదికి ♦ నుత్త దిగంబర రూపధారియై।
దేహము నిరీజాల్మ్మకుగ ♦ దోచును నాకిటు గాంధి, వానిసం।
దేహము లేక కాల్చిరన ♦ దెప్పుననొచ్చి మనంబుసోలెడున్॥

వ॥ యుద్ధకాల హిందూదేశ రాజ్యాంగమంత్రిగ యల్. యస్. ఎమెరీయిట్లు వగచెను

ఉ॥ నల్లనిఫాసిను కోటకటి ♦ నల్లని హేటునుదాల్చి సీమలో।
నల్లగ తాను చేర్చుకొను ♦ మిష్టరుగాంధి యిదేమి యిట్టులన్।
గొల్లయుదార్చి తాధనము ♦ కోరక తాపసురీతి గోట్లవా।
నుల్లము లెల్ల నాటగొను ♦ నోకమి జాటిమతంబులన్నిటన్॥

చ॥ శమము దమంబు జీవనపు ♦ సాధనధర్మములై వెలుంగ, నం।
యమియు రాజతంత్రమునో ♦ యారముగాగ నుజ్వ్రకసంపదన్।
యమనియమాలతో నడపి ♦ యంచితలీల స్వరాజ్యనిర్ణయం।
బమరెను శాంతివిప్లవము ♦ నాంగ్లులు దిగ్భ్రమ మెచ్చిచూడగన్॥

గీ॥ మతముకులము తనకు ♦ మాన్యత లేకున్న।
జనులు తన్ను జేర ♦ జాలరనుచు।
హింసలేనిసత్య ♦ హితమగు మార్గంబు
నఖిలజనుల కందు ♦ నటుల గూర్చె॥

చ॥ సుగుణముచేతనే సకల ♦ శూరుల జేరిచె శాంతసంయుతిన్।
సుగుణముచేవిపక్షులను ♦ జోద్యము మోహితులన్ బొనర్చెడిన్।

తే॥ గీ॥ సత్యయుగ తాపసోత్తమ ♦ జాతినేఁడు।
మాయమాయెను నీ వైశ్య ♦ మానితోఁడ।
దేహమును హత్యగావింప ♦ దివిరినాఁడు।
సత్యప్రేమలజంపగా ♦ జాలడనికి ॥

ఉ॥ ఇంకెపుడీజగానఁ గను ♦ నీక్యగుణాఢ్యులు శాంతిదాంతులన్
జంకక విశ్వమున్ గెలిచి ♦ జల్లగ జల్లని కాలు మేర్పడన్।
శంకయికేల తృష్ణగొను ♦ శాసితరాక్షస వంకమగ్నమై।
సంకటయుక్తమౌ పుడమి ♦ సాకగ గాంధి పథంబె దిక్కగున్॥

వ॥ కాశ్మీర పక్షపు హిందూరాజ్యాంగమంత్రి "పెతిక్ లారెన్సు" రీతి వలపోసె

ఉ॥ గుండెలువ్రీలు పెట్టినను ♦ ఘోరతరాద్భుత వార్త విన్నవో।
రండు మహాత్ముడానితను ♦ ప్రాణపుటుత్క్రమణంపు వేళనో।
తండడదికోటిజీవముల ♦ ధారయొనర్చెనో యట్టిప్రేమయే।
పండిఫలంబొసంగునన ♦ పావన దేహమొదోహదంబుగాన్॥

తే॥ గీ॥ భువిజరితను సన్నమూ ♦ నవుడెవండు।
జనులనందరనదనెపు ♦ సద్గుణముల।
పూతచారిత్ర సత్కథా ♦ వ్రాతములను।
సోలజేసెను నీలీల ♦ జోద్యమంద॥

వ॥ భారతయూనియన్ ప్రధానమంత్రి జవాహర్లాలు నెహ్రూ దుఃఖసంతప్తహృదయుండై రేడియోలో నీరీతి చింతావిష్టుండై హృదయదారుణంబుగా విలపించె-

తే॥ గీ॥ కారుచీకటి క్రమ్మెను ♦ జ్ఞానదీప।
మారిపోయెను పదములు ♦ దేరిరావు।
హితులు రా రండు సన్మిత్ర ♦ తతులురండు।
జాతితండ్రియౌ మనబాపు ♦ జగతిబాసె॥

ఉ॥ అక్కట తప్పుబల్కితివె • యామహనీయునికున్న చావు;హా!
నిక్కము యాస్వరూపమిక • నిచ్చలు జ్ఞానమరీచిసంతతుల్!
దిక్కులబిక్కటిల్ల మన • దిక్కయి సత్పథసూచకంబుగా!
మక్కువజూపకుండుటలు•మాన్పెడె, నామదిదుర్భరంబికన్॥

తే॥ గీ॥ భక్తినంయుక్తప్రార్థన • బాపుకొఱకు!
నాత్మశాంతికి గావించు • నట్టి మనము!
సత్యపథవర్తియుమ్మూర్తి • చక్కదేని!
కిచ్చెప్రాణంబు దానిగా • వించుటొప్పు॥

ఉ॥ జ్యోతియెయారిపోయెనని • సోలుచు బల్కితినద్దితప్పు; వి!
ఖ్యాతిసనాతనంబులగు • కల్మషహీనపు సత్యసూత్రముల్!
జ్యోతులుగాగ, వేయుఘన • సుందరవర్ణము లేగినన్మహా!
నేతమహాత్మగాంధి కృతి • నిర్మలవాక్కులతోడ వెల్గవే॥

ఆ॥ వె॥ పిచ్చివాడొకండు • ప్రేల్చెరివాల్వరు!
దానధర్మసూత్రి • తగువువిరిగె!
పిచ్చివాడెవాడు • ప్రీతినవ్విషగర్భ!
ఫలముమ్రింగ విషము • తలకునెక్క॥

ఉ॥ కొట్టెనుబాపునంచు గడు • గోపపరీతమనంబుతోడ, నీ!
చెట్టను బంధుమిత్రులను • జేడ్పడహింసను జేయబోకుడీ!
కట్టిసిజాతివైర విష • కల్మషకుంజఫలంబదాటచే!
గొట్టుడి జాతివైరవిష • కుంజము ప్రేమలవిత్రధారలన్॥

వ॥ మాజీకాంగ్రెసధ్యక్షురాలు, భారతకళావనీ కోకిలమిట్లు దుఃఖోద్రిక్తకుహూకారంబుల రేడియోయందు వినిపించె-

తే॥ గీ॥ హిందుతురకల మైత్రికై • ముందుగాంధి!
యశనవిరహిత దీక్షను • నడరె; తుదకు!
గూడ తత్ఫలసిద్ధికే • కోరిమడిసె!
నపుడు దేశంబుసహియించె • నిపుడు లేదు॥

ఉ॥ కూడిక లేదొకింత, పెఱ ♦ కోరిక పై సహింపు లేదు, సై |
దోషులపేర్మి లేదు, మది ♦ దోహపుటూహ లెవిండె, నందఱన్ |
వీడెను నమ్మకం, బెసల ♦ ద్వేషము లేక మబండె; నయ్యయో॥
నేడిట నేమి తానగన ♦ నేరని దుర్గుణముల్గనంబడున్ ॥

శా॥ అకట, యిం దేమి పాపము, మహా ♦ మహిమాన్వితహింసాదుర్ధర్మముల్ |
ప్రకటితరీతి నేడుణము ♦ పావనజీవితమంను దక్షతన్ |
సకలప్రపంచమానవులు ♦ సాక్షిగ నాచరణంబు జేయు, నా |
యకమణి హిందుసోదరుల ♦ హస్తములంబడి ప్రమందనాయె నే॥

ఉ॥ కాయమునందు, జీవితప్రా ♦ కారమునందున, నొక్క ప్రాణమే |
మాయనలీలనుంటిమియు ♦ హో! యిక మా దగుకండకండమా |
ప్రియవసంతకోకిలము ♦ వాసెనుమమ్ము, వట్టికట్టెలే |
యాయెను శేషమింతటిప ♦ హా! క్రియ లేని పదంబులైతిమీ॥

ఉ॥ ఏమిది యింతనిస్సహా ప్రహా, యి ♦ కీగతి జీవితమంత వేస్తికె |
మేముపయోగపర్చితి మ ♦ మేయము త్యాగమహాస్రవంతిలో |
గామితతోయజాతముల ♦ ఖండములంచుదలంచినామొయూ |
ప్రేమనహింసనింక మన ♦ వీగునితోడనె యుంపువారమే ॥

ఉ॥ పోయె శిరోజముల్ చెదరి ♦ పోవగ, గుండెలబాదుకొంచు వా |
పోయెడి కాలమింక; నడు ♦ ముల్విగియుంపుడు, ముక్తకంఠతన్ |
'జే'యని ఖండఖండముల ♦ శ్రీయుతగాంధివిపన్నలోకమున్ |
బాయక ప్రోవజూపిన సు ♦ మార్గమునం జనరండు లెండికన్॥

ఉ॥ సత్యమె బాపుటూరివుల ♦ జల్లని ప్రేమనహింసమించు టే |
నిత్యము గాచుడాలు,ధర ♦ ణిస్థలి నెయ్యొడగక్షపాతసాం |
గత్య విహీనతత్త్వమో,యు ♦ ఖండబలంబున దిప్పుకత్తిగా |
స్తుత్యము నాత్మసూత్రముల ♦ జూపుచుజాటగరండురండికన్॥

తే॥ గీ॥ సత్యబోధునిబంటులై ♦ సకలగతుల |
వాడవాడలజాటంగ ♦ నేడు దీక్ష

రైలోనగరందు, మనబాపు ♦ కదనరీతి।
విజయము గుదాక పట్టును ♦ విడువజనదు॥

తే॥ గీ॥ చావనగ నేమి, మాతండ్రి ♦ చావ లేదె ?।
సత్యముడిగెడితటి జావు ♦ జగతి లేదు।
కనుకి దేనిత్యజీవిత ♦ మనెనతండు।
మెట్టు పైమెట్టు లాత్మకి ♦ మెట్టుమనెనంగె॥

ఉ॥ రాజులలోన నీగుణవి ♦ రాజితు దేహము పంచభూతముల్।
పూజలతోడనందుకొనె ♦ భూరమణుల్గ నీడ, శాంతివి।
భ్రాజితరాజ్యదీప పరి ♦ రాజిత, నీసుగుణాఢ్యనేత, క।
వ్యాజనతీక్ష్ణ శాంతనమ ♦ గార్జితి హైందవరాజ్యలక్ష్మికిన్।

తే॥ గీ॥ బాపునకునెందు శాంతియే ♦ వలయుగాక !।
శాంతివర్ధక నీ కేటి ♦ శాంతియగును।
నిందు దీక్షితరతరము ♦ లందునిలువ।
జలము తేజంబునొసగను ♦ జాలనొసగు॥

వ॥ భారతరాజ్యాంగ యుపప్రధాన సచివోత్తముండు సర్దారు పటేలిట్లు చింతావిలోలత్వంబున రేడియోయందు వచించె.

ఉ॥ ఇప్పుడె శామహాత్ముకడు ♦ నింపగు వాక్సుధారసంబుమా।
చొప్పను నిర్వచింపవిని ♦ చొక్కుచు గేహముజేరినాడమా।
యప్పయి దైవముంగొలువ ♦ నార్తముతో జనె; నిట్టి ప్రేల్చెమా
యొప్పులకుప్ప జంపెనట ♦ యోర్వక యెట్టికిరాతుడో కదా।

తే॥ గీ॥ ప్రేమశాంతియు బాపుజీ ♦ ప్రియవదనము।
జూపుచున్నవహో! రాము ♦ జూచినట్లు॥
తప్పు క్షమియించితివి బాపు ♦ ధర్మమూర్తి।
నిన్ను మాకీయగలడె యా ♦ నీచుడిపుడు॥

తే॥ గీ॥ నీవు జీవించునప్పుడు ♦ నెజవ లేని।
హిందుముస్లిము సఖ్యంబు ♦ హీనవ్వతి।

నిట్టి జ్వాలలికలైడ • నెదలుగలయ ।
నేకమై నీకు సంప్రీతి • నిచ్చుగాక ॥

తే॥ గీ॥ అటుల రేడియో వినిపించు • నార్తివచన ।
సముదయంబుల నాలించి • సకలజనులు ।
సాధుహత్యావిశేషాల • సరణిదెలియ ।
నుదయపత్రికలో నిట్లు • చదివిరంత ॥

— • హ త్యా వ ర్ణ న • —

ఉ॥ ఇంచుకమించెగాలమిది • యేమి విచిత్రమటంచు మెల్లగా ।
వంచిశిరంబు దేహమును • బాదములంటెడులీలదోపగా ।
వించి, తటాలునంగరము • నెత్తి రివాల్వరు పేల్చెసాగరో ।
మ్మించుతళుక్కుమన్నటుల • మేదిని వ్రాలెమహాత్ముడాయెడన్ ॥

ఉ॥ ఇన్నిదినంబులెవ్వరికి • నించుకహింస యొనర్పకుంటయే ।
యెన్న మహోన్నతంబగుచు • నేర్పకుజీవితధర్మమంచునే ।
గ్రన్నన బల్కుచున్న, నను • గాసిలగొట్టె 'గాడ్సె' యమ్మనం
దున్నతదంశమేయునెడు • నూహను 'గాంధి' యటంచిలన్ బడెన్ ॥

ఉ॥ చెప్పులుజారె బాదముల • జెన్నుదొలంగెను మోమునందువే ।
యుప్పతిలెన్ బ్రశాంతియుత • ముజ్జ్వల తేజము కాంతిదెల్పగా ।
నొప్పెడి కంటియద్దములు • నోర్వక వీడెను నేత్రయుగ్మమున్ ।
గుప్పగగూలె నామహితు • కోమలదేహము రక్తలిప్తమై ॥

ఉ॥ నిండెను, హస్తముల్ ప్రజల • నిస్తులప్రేమ నమస్కరించున ।
ట్లుంకిన వట్టులేపడెను • హాయను దుఃఖసముద్రఘోషమే ।
చండతరంబగాచు నలు • చక్కటులంబ్రభవించెశోకమో ।
ట్లుండినదట్టులే విలయ • మొందెదులీలల దోచెనయ్యెడన్ ॥

తే॥ గీ॥ ఆపమనుగాంధులంతట • నమ్మహాత్మ ।
దేహమాతురతందగ • దేర్చ యత్న ।



చరమ సంస్కరణము.



శా॥ జ్వాలల్ప్రోంగి మహాత్ము దేహమను హ•వ్యంబున్ దగన్వ్రేల్వ, స
ప్తార్చిలుం డగ్నినేకత న్ప్రబరయగా •దివ్యుల్ కరుల్ హవ్య సే |
వాలోలత్వమునం జెలంగగను న•వ్వారిన్ దగన్ దృష్టిం, దా |
లీలం జేయగరువ్వ హవ్యకబళా • లే నారవల్ప్రాల్పెపిన్ ||

మొనరగానింప వృథయాయె ♦ నూగ్రహెచ్చె |
నందఱు మహాత్ముబిర్లా గృ♦ హంబుజేర్చె ॥

ఉ॥ ఆగృహమందె మున్నతదు♦హైందవముస్లిముమైత్రికోసమై |
త్యాగముతోడ ప్రాణముల♦దాగదు ప్రీతినొసంగబూనె;నా |
నేగముతోడనాయెడనె♦ వేమిగుమి తులకూర్మిపేర్మి ను |
ద్యోగవిధానము న్నెఱపె♦నూఱడిలంగను ఢిల్లిముస్లిముల్ ॥

తే॥ గీ॥ అదియె పర్యంకమందున ♦ నామహాత్ము |
డటులె ప్రాయోపవేశంబు ♦ నందుగూడ |
నధివసించెనుగా ఋష్టు ♦ హార్యమైన |
నటులె స్థిరమయి యాచోటె ♦ యమరెనౌర ॥

ఉ॥ ఎన్నియుగంబులేగునొకొ♦యిట్టిమహాత్ముడులోకదోషముల్ |
తిన్నగ జేయగామరల♦ దేహముదాల్చుట, లట్టిలోటచే |
జెన్నలరారు నీసుగుణ♦శేఖరు దేహము తైలలేపనన్ |
గ్రన్నన జేసి ముందరి యు♦గంబులవారి దరింపజేయరే ॥

చ॥ అనియెను మాంటుబేటనుమ♦హామహుడాదరభావమొప్పగా |
వినిరి జవాహరుండు కడు♦విశ్రుతవల్లభభాయి యార్తితో |
మనవిని దేవదాస్గిటుల ♦ మన్ననజేసె 'మహాత్మ దేహమా |
యనలునికాహుతిన్ సలుప♦నాజ్ఞనుజేసెను మున్నె యుంచటన్' ॥

ఉ॥ ఆవిధిజేయుటొప్పనుమ♦హాత్ముడుపొందెనమర్త్యభావమున్ |
బావనసత్యసంధతయు♦బాపవిహీన మహింసతత్త్వ మిం |
కీవసుధాస్థలిన్ వెలయు♦ నెన్నియుగంబులో యంతకాల మా |
దావిభుడుంటనిశ్చయము♦నయ్యెని దేహములౌనుగాంధికిన్ ॥

సీ॥ రక్తరాగములొంచు ♦ లావణ్యహీనమౌ
మలినోత్తరీయముల్ ♦ మాటుపెట్టి |
స్వచ్ఛమై యమలమై ♦ వన్నెమీఱెడు తెల్ల
ఖద్దరుబట్టల ♦ గట్టబెట్టి |

శుభ్రప్రకాశమా ♦ శుద్ధవర్యాంకంబు
నందు సుప్తనిలీల ♦ నొందనుసిచి ।
పావనవాహినీ ♦ వగమర్షి పూజిత
యమునాజలములందు ♦ నమరజల్లి ।

తే॥ గీ॥ దివ్యసుమములమధ్యను ♦ తేజమెసగ ।
గల్పవృక్షంబులందెల్ల ♦ ఘనతవెలయు ।
విమలమందారతరువునా ♦ వెలయునటుల ।
నలమహాత్మునితనువును ♦ నందునునిచి ॥

చ॥ శిరముదరిఁ బ్రసన్నముఖు♦శ్రేష్ఠమసీముల మిక్కుమిక్కునన్
బరమప్రశాంతగోఘృతపు♦పావనదీపము నందమర్పగా।
బరగెనునద్ది హింసమయ ♦ పశ్చిమ నవ్యమహాప్రతాప దు ।
ర్భరతరనాగరక్షితిని ♦ రాజిలు బాపు ప్రబోధమోయనన్ ॥

చ॥ తిరముగ బాపుజీ విమల♦దేహము పక్కనుధూపధూమముల్
కరముమరుద్విభూతిబన♦గా ఘనమార్గము దిక్కుపోల్చెదున్ ।
పరము పునీతహృత్కమల♦వాసి ఘనేప్సిత పత్పదంబులా ।
దరమున లోకనాథుపద♦తామరసంబులజేరుటోయనన్ ॥

చ॥ కనులకు గానరాక కదు♦గమ్మనివైన సువాసనల్ సదా ।
జనులకొసంగు ద్రవ్యములు ♦ చాలగజల్లిరి వారలయ్యెడన్ ।
ఘనుడగు బాపుదేహమిక♦గానకయున్నను వారిస్ఫూర్తముల్ ।
మనియెడు నీజగానొక♦మానితశోభయొసంగియున్నటుల్ ॥

క॥ రామా, రఘుపతి రాజా ।
రామా! కావుము పతితుల ♦ రాఘవరామా ।
నామంబె పుణను మేఘ
శ్యామా! నీయదె మదిదగు ♦ జానకిరామా ॥

క॥ వైష్ణవుడనగను నెవ్వరు ।
విష్ణుని మనమున దలచెడి ♦ విజ్ఞుడెసుమ్మా ।

జిష్ణుగా నరుత కృష్ణుతుపిల।
తృష్ణ నడంచుచును వెల్గు ధీరుడె సుమ్మా॥

తే॥ గీ॥ బాపుజీభక్తి సంయుక్తి ♦ భావమందు।
నెల్ల వేళల బతియించు ♦ హృద్యగేయ।
పదములివియని దుఃఖంబు ♦ లెడలనుబుక।
బాడి రావయుమనుగాంధి ♦ గూడియపుడు॥

ఉ॥ సిక్కుల నాయకుండపుడు ♦ శ్రీ గురుపంతు ప్రబంధసూక్తులన్
మిక్కిలి ప్రేమతో నపుడ ♦ మేయముగా వినుబాపు వానిలో।
మక్కువనాత్మ హాంగునని ♦ మానవదుఃఖభరాన్ని గుంగియున్
గ్రక్కునరుద్ధకంఠుడయి ♦ గౌరవయుక్తి బఠించెనా రీతిగాన్॥

ఉ॥ పావనజీవుడై వెలయు ♦ బాపునిరంతర శాంత ప్రేమతో।
శావసమర్థముల్ జనులు ♦ కల్మషదుర్దమపంకమగ్నులై।
లేవనశక్తులైనతఱి ♦ లెంకు మహాత్ముని ఆత్మశాంతికై।
మీా వగజూప రెండగుని ♦ మేషము లే నిలుడయ్య వానులై॥

తే॥ గీ॥ అనుచు నాయకశ్రేష్ఠులా ♦ యామినిదగ।
నష్ట ఘటికల తదుపరి ♦ నఖిల భరత।
ఖండవాసులు మానంబు ♦ రెండు నిమిష।
ములను బూనంగనాజ్ఞను ♦ బూనిసేయ॥

ఉ॥ మానపుటంతమందు, నను ♦ మానవహీనత, నమ్మహాత్ము న।
న్మానితజీవితార్థముల ♦ మానుమత త్త్వరహస్యబోధలన్।
జ్ఞానలతాంతవాసనల ♦ గల్గు సనాతన సత్యసంపదల్।
దేని వెలుంగొ యావిమల ♦ దివ్యసుగీతపఠించిరయ్యెడన్॥

తే॥ గీ॥ ఇంతలోనన నదుతేయు ♦ మేగుటయును।
పూజ్య మాహాత్మ్య దేహంబ ♦ పూర్వరీతి।
సర్వప్రేక్షకలోచన ♦ పర్వముగను।
నొనర దుదిసారిగావింప ♦ మనముగదుర॥

సీ॥ యమునా మహానదీ • యమలినజలముల
మనసార గడసారి • తనువు కడిగి।
ధవళతమంబులౌ • తరుణాచ్ఛసుమముల।
బొందగుపర్యంక • మందమర్చి।
స్వచ్ఛతమంబైన • సచ్చరిత్రుండటంచు
నమలిన వసనాల • నమరగట్టి।
యతిపేశలంబౌచు • నమరువాక్కులతండ్రి।
నలరులపాన్పున • నడరనునిచి।
తే॥ గీ॥ పితృకులద్రోహచింతల • పెంపులుడుగ।
దేశభక్తి తలంపులే • తేజరిల్ల।
తనరుభారతభాగ్య వి • ధాత మొగము।
ప్రేమదర్శనపాత్రమై • వెలసెనపుడు॥

ఉ॥ తోడ నెయమ్మహాత్మగను • తొందరబారుజనస్రవంతి దా।
నేడజనించెనో పురపు • నింపగువీధులపిండి రథ్యలన్।
గూడనుబిక్కటిల్లి కడు • గూర్చిన నూంగనఢిల్లి నెల్లెడన్।
నీడయొకింత లేనటుల • నిండిచెలంగె క్షణక్షణంబునన్॥

ఉ॥ రాతిరిబాపుజ్ఞానమయ • రాజ్యములోనకలంక శేముషీ।
ఖ్యాతమరీచిదీధితులు • గల్గగ నేగెనటంచు, భాస్కరుం।
డాతనియాతురంబయిన • యంచితమూర్తి నిగాంచునాత్రపున్
భీతినిదాంగిచూచెనన • బేర్మిసితోచెను దూర్పుదిక్కునన్॥

శా॥ బిర్లాసౌధముఖాంగణంబున, నహో • ప్రేమాఘసద్వీచులన్।
దార్లంజేసి, ప్రపంచజీవిత మహా • దుస్తంత్రినౌకన్ వెసన్।
స్వర్లోకాపులవాహినీ ప్రవిలస • త్సారాంబులన్ దేలగా।
దర్లంజేసినపుణ్యభాగుగనగా • దాడాసెనుత్కంఠమై॥

చ॥ ఒకనిని పీపుదన్ని మఱి • యొక్కడు; వానికివెన్కనట్టులే।
యకలుషవృత్తినిల్చికని రాతతదర్శనభాగ్యలోభులై

నిశ్చలమనస్కులై జనులు ♦ నిగ్రహితసత్ప్రభవ వర్తనక్రియా ।
ప్రకటితహిందుసారగుణ ♦ రాజితు గాంధిమహాత్ము నయ్యెడన్ ॥

శా॥ స్వచ్ఛంబై ధవళంబునై, వెలుగునా ♦ వస్త్రంబు రాణింపగా ।
స్వచ్ఛంబైన మహాత్ము సచ్చరిత సం♦వ్యక్తిలన్ పోలెడిన్ ।
స్వచ్ఛీలుండగు బాపుజీ ఖతవిరా♦జద్రక్త చిహ్నంబులా ।
తుచ్ఛుండీగతి భావిదేశ చరితం♦దోపంగ నాస్త్రోలెడిన్ ॥

ఉ॥ శాంతనివాసమై విమల ♦ శాశ్వతభక్తి నటించు రంగమై ।
దాంతి శమాది సద్గుణ వి♦తాన విలాస విరాజమానమై ।
యెంతయు నొప్పు నెమ్మొగము ♦ దించుక క్రిందనుగ దసీమలో ।
గాంతి వెలింగె శుద్ధమగు ♦ ఖద్దరుమాల సమస్తపూజ్యమై ॥

ఉ॥ జీవితమంత మీకృపను ♦ జల్లగు రీతి జరించి మన్ననన్ ।
సేవలొనర్చి, మీదగు వి♦శేష మహోన్నత భావనార్థమై ।
మీపవలె భారతీజయమ ♦ మీకములంకునముందు నిల్చి, యీ ।
చావున గూడ పీడనను ♦ చూయ వెలింగెను మాలతోమ్ముఖస్థ ॥

ఉ॥ అంత విమానయానమున ♦ నాయతి రాజ్యసుపాలనక్రియా ।
క్రాంతమనస్కుడున్నత ప♦రాక్రమ సంయుత సైన్యయుక్తుడౌ
త్యాంతియుతో విశాలుడు, ని♦తాంత మహాత్మవియోగదుఃఖము
శ్రాంతము మానసాంబుజము ♦ దాపిడి వెట్టగ వచ్చె వంతునన్ 145

ఉ॥ కాలికి దాపుగా నమృత ♦ కారుణసింపగ దీక్ష రోజనన్ ।
నేలను జూచుచా మెడ, స♦నిద్యపరాక్రమ శాంతమూర్తి న ।
చ్చెలుడు వల్లభాయి విల♦సిల్లగ జట్టు గులాబి రేకులన్ ।
జాలిమనంబుతోగ నిను ♦ సన్నుత భారతనేత గాంధినన్ ॥

ఉ॥ లోకమునించు వాగమృత ♦ లోల ప్రకాశతరంగమాలికా ।
నీకము జన్మతావయిన ♦ నీలసునేత్రములివ్వె, యొట్టుల ।
స్తోకమకాలమృత్యుకర ♦ శూల విశాలవిదారణంగ దున్ ।
వ్యాకులమొందజేసెనని ♦ హా! తెనపారవిచారమగ్న

శా॥ ఈనాఁ డయ్యెడి యుద్ధవాహనమునం♦దీ బాపు దేహంబుదే ।
పోలెన్ద్రిప్ప బ్రభాన మిగవపవం♦బుల్ పొడ నద్దిక్కులన్ ।
గ్రాలం జేసెడి మద్దభద్దుల వే♦గస్ద్రిప్ప, మీరందరున్ ।
గాలాతీతముగాక మున్న చనగా♦ గార్యోచితంబీమెకన్ ॥

తే॥ గీ॥ అనుచు డక్ష్యాసు వచియింప ♦ నంత బాపు ।
వ్యాకిలాంబును, నావ యుం♦ జేసి యుతర ।
హితులతోఁ దుత శ్రీ గాంధి♦ నతి విషాద ।
భావముల జేర్చెరా యుద్ధ♦వాహనమున ।

ఉ॥ ముందుగ వల్లభా ,,దన♦పూజి పాజసరోజపీఠిలో ।
గ్రందుగ గూర్చుచుండె, ఆ ద♦పట్ట ను బాన్యుడు రామదాసునున్ ।
డెందము దుఃఖభారమున♦ డిప్పను ముందగనుండె; నెన్నఁగా ।
నందెవసించె సిక్కులమ♦హాబలుడా బల దేవసింగునున్॥ 150

ఉ॥ లోకములోని కష్టముల♦రూపఁ నశింపఁగ జేసి, శాంతవా ।
సీకము మిత్రబృందము♦ నేర్పునమార్గమున ప్రేమ నెల్లరున్ ।
జేకొన జేసి, సర్వజన♦చిత్తవిహార మొనర్చి, బాపికన్ ।
నాకము జేరబోయెన ట♦ నాగను శంఖము మ్రోసిన త్రాతన్॥

సీ॥ శాంతైకసంగర ♦ స్థాపనాచార్యుడీ,
వీరుండు మాసేన ♦ జేరవలయు ।
ఆదర్శ గగనాభి ♦ యానసమర్థుండు,
వైమానికులతోడ ♦ బరగవలయు ।
దుష్టతంత్రపుశాక ♦ ద్రుంచెడి టార్పెడో,
శ్రీగాంధి నావిక ♦ శ్రేణివాడు ।
సత్యమతవ్యాప్తి ♦ సాధకుండీ సాధు
డన్నిమతంబుల ♦ నున్నవాడ ।

తే॥ గీ॥ టంచు సైనికు లాకాశ♦యానపతులు ।
నావికులు రాజ్యతంత్రజ్ఞ♦ నాయకులును ।

సర్వమత నైష్ఠికాత్ములై ♦ చనెడివారు ।
మేము మేమని లాగిరా ♦ మేటిరథము ॥

చ॥ రథమునముందుభాగమున ♦ రంగుదొలంగుచు రామదాసు,పృ-
ల్పృథగిమునైకమానసు,డు ♦ దారుడు జవ్వారువామపార్శ్వగా
త్యధికబలప్రధాయి సర ♦ దారట జవ్వాగు వెన్కనిల్చెనన్ ।
ప్రథితపరాక్రముండు కుడి ♦ పార్శ్వమునన్ బలదేవుడున్నడన్ ॥

తే॥ గీ॥ పెక్కు రాయబారులొకట ♦ నిక్కువముగ ।
గౌరవంపు బెపు మదుల ♦ గలవరింప ।
భూరి సుమమాలలెలమిని ♦ బూజ్యదేహ ।
మునకు భక్తి సమర్పించి ♦ చనిరపిదప ॥

చ॥ జయజయగాంధికిన్ బరమ ♦ సాత్త్విక సద్గుణచక్రవర్తికిన్ ।
జయజయ మోహనాఖ్యునికి ♦ సత్యనిరంతర రక్షణాసక్తికిన్ ।
జయజయ నవ్యభారత ప్ర ♦ జాహృదయాబ్జవికాసవర్తికిన్ ।
జయజయ భారతాభ్యుదయ ♦ సత్ఫలసాధకదివ్యశక్తికిన్ ॥

చ॥ జయజయ శత్రుమోహనప్ర ♦ శాంతగుణోత్తమరత్నరాశికిన్ ।
జయజయ శర్వమానవవి ♦ శాలసుహృద్గుణజాలపూర్తికిన్ ।
జయజయ హిందుముస్లిము ప్ర ♦ జాపరిపోషిత భ్రాతృవృత్తికిన్ ।
జయజయ సాధితాఖిల వి ♦ శాలమతాంతరతత్త్వదృష్టికిన్ ॥ 155

చ॥ జయజయ శాంత సూత్రపరి ♦ శాసితహూణజనాళి భర్తకున్ ।
జయజయ సత్యవాక్యజిత ♦ సాయుధనాద్యకుతంత్రహర్తకున్ ।
జయజయ కోపమూలపరి ♦ సాధితపంచమసత్త్వరాజికిన్ ।
జయజయ శాంత సంగరప్ర ♦ శంసిత దివ్యపథానుయాయికిన్ ।

తే॥ గీ॥ అనుచు జేజేలుగొట్టుచు ♦ నధికభక్తి ।
నఖిలనాయకవైమాని ♦ కాద్యనేక ।
నాహినీసము దయములు ♦ వాగివాగి ।
తూర్యకేతన ♦ వాద్యముల్ తూగిమ్రోయ ॥

ఉ॥ అల్లదెసల్లవస్త్రముల • నయ్యెడమానవ దుఃఖమూచనన్ ।
తెల్లముచేయఁగా వెడలె • ధీరుఁడు నీకుడు ష్రూంటుబేటనుం ।
దుల్లముడీలఁగా నెదుట • నుండిరి పాంచలయూపికోర్నరుల్ ।
మెల్లగ సాగిరా మొదను • మిదురి దుఃఖనిమగ్నచిత్తులై ॥

ఉ॥ అంతనురాయఁబారుల న • మంచితదివ్యసుపుష్పమాలలో ।
కాంతయు నమ్మహాత్ముముఖ • మేర్పడదర్శనమీయఁ కుంచికన్ ।
సుంతదెమల్చిరా మొదను • శూరు, జనావళిగాంచునట్టులన్ ।
కొంతను బంధుమిత్రులువి • శేషవియోగహతాంతరాత్ములై ॥

తే॥ గీ॥ తెల్లమబ్బుల దోబూచు • దేరుపూర్ణ ।
చంద్రబింబంబు నాబూల • సాధుదోప్ప ।
కర్మమహా మృత్యుజీవిత • గతులతోడ
నాటలాడెను జీవాత్మ • యందమునను ॥ 160

ఉ॥ ముందుగనాత్మబంధువులు • మున్నుమహాత్మునియాశ్రమంబునన్
డెందములా మహాత్ముబురు • డించెడిలీల వెలుంగుకొందరున్
మందగతిన్ జనంగఁగదు • మానిత దుఃఖవిషణ్ణచిత్తులై ।
యందలి ఘూర్ఖసైనికులు • నండటి మార్గముదిద్దితీర్పఁగన్ ॥

ఉ॥ చెంతవిమానసైనికులు • చెల్మిమహాత్మకు జేయుటంచు జే ।
మంతులు మల్లెమొల్లలు వి • మానములందులనుండి ప్రేమతో
నంతట జల్లుగాఁగురియు • నాదరప్రేమపురస్సరంబులో ।
నంతతరంగముల్ హృదయ • వార్ధిగలంపగ మాటిమాటికిన్ ॥

సీ॥ అతడటే మొనమొన్న • హైందవవ్యక్తి బాప,
నూరూర నవకాళి • నోర్మిదిరిగె ।
అతడటే యిస్లాము • మతమువారలగావ,
నుపవాసనిధిల్లి • నుపగమించె ।
అతడటే లాహోరు • నతివలరక్షింప,
సరియైనమార్గంబు • జక్కఁజూపె ।



హిందూ-ముస్లిమ్ సమ్మేళన యాత్రా సందోహము.



సీ॥ అతడటే మొవమొన్న హైందవ వ్యథబాప, నూరూర నవకాళి నోర్మిదిరిగె
అతడటే యిస్లాము మతమువారలగావ, నుపవాసవిరాళ్ళిల్లి నుపగమించె
అతడటే లాహోరు నతివలంక్షింప, సరియైనమార్గంబు జక్కజూపె
అతడటే యీభారతావని జీల్పంగ నవివద్దు వద్దని యనియె మొన్న

తే॥ గీ॥ ఎల్లకాలంబు నైక్యంబు నెదనునమ్మి సర్వకర్మముల్ దేశంబు చక్కజేయు
జేసె రాజ్యాంగ సన్యాస జీవితంబు గడపి యైక్యంబునకు బ్రాణమెదల నిచ్చె.

అతడచే యీ భారత ♦ తావని జేల్వంగ
వనితద్దు వద్దని ♦ యనియె మొన్న ।

తే॥ గీ॥ ఎల్లకాలంబు సైక్యంబు ♦ నెదనునమ్మి ।
సర్వకర్మముల్ దేశంబు ♦ చక్కజేయ ।
జేసి రాజ్యాంగ సన్న్యాస ♦ జీవితంబు ।
గడపి యైక్యంబునకు ప్రాణ ♦ మొడల నిచ్చె ।

సీ॥ ఈ వీరుడేకదా ♦ యెనలేనికష్టాల
స్వాతంత్రలబ్ధికై ♦ చక్కనోర్చె ।
ఈ శూరుడేకదా ♦ యీరాజ్యతంత్రాన
సత్యంబహింసయు ♦ జక్కనాటె ।
ఈసూరుడేకదా ♦ యిల వైశ్యుడైపుట్టి
బ్రహ్మతేజముతోడ ♦ బరగెజగతి ।
ఈధన్యుడేకదా ♦ సాధారణజనంబు
వీరాధివీరుల ♦ తీరుజేసె ।

తే॥ గీ॥ బందిఖానాలవన్ని యే ♦ భవ్యమూర్తి ।
దివ్యమపవర్గధామంబు ♦ తీరునందె ।
చావు స్వాతంత్ర్య కళ్యాణ ♦ సాధ్విపాణి ।
గ్రహణసమముగ దోచెనీ ♦ ఘనుని మహిమ ॥

సీ॥ పరదేశవస్త్రాల ♦ బానిసత్వము బాప
చర్కానుదాల్చెనే ♦ చతురవాది ।
కడు బీదసాదల ♦ కరుణమైరక్షింప
గ్రామవృత్తుల సంఘ ♦ రాజినిలిపె ।
బలహీనజనులను ♦ ప్రబలాంగ్ల సామ్రాజ్య
మెదిరింప నసహాయ ♦ పథముజూపె ।
ప్రజల భయముపైన ♦ ప్రభవించుసైతాను
రాజ్యంబడప జన ♦ బలము గూర్చె ।

తే॥ గీ॥ నార హైంధవసంఘు ని♦స్సార మడప ।
లవిలిన స్పృశ్యతా నివా♦రణము జెలువు ।
వాడవాడల జల్లె న♦వ్వారిగాగ ।
నితడె యనుచును జనులెల్ల♦నుతినిజేయు ॥ 165

సీ॥ కలనైన నితరుల ♦గలత వెట్టనివాని
జంపగా గరమెత్తు ♦ చాపగలిగె ।
దనుబో లెదురి తంపు♦దారిబో యెడివారి
గొట్టనేరక సాధు♦ గొట్టనగునె ।
సత్యమార్గముపోగ ♦ సరియని చూపెట్టి
బోకున్న దనకడ్డు ♦ పోగ లేదు ।
'కొలిజియం'బున బ్రాణి ♦ గోలుపోయిన సాధు
వధ లీల నీహింస ♦ వ్యధనడచునె ।

తే॥ గీ యనుచు దమలోనిభావంబు ♦లప్పుడపుడె ।
పైకి నుబుకగ తద్బాధ ♦ బాపుకొనుచు ।
గనుల జలములు జలజల ♦ గారుచుండ ।
లేచి దుఃఖించిరా వీరు♦జూచిచూచి ॥

సీ॥ పాపంబు లెరుగని ♦ పావనాత్ముడితండు
వైకుంఠమునకేగు ♦ వాడు లేదు ।
దుష్టులలో నిట్టి ♦ శిష్టుండు నిలుచునే
కాకులలోనున్న ♦ కోకిలంబు।
స్వాతంత్ర్యమిప్పించె ♦ జవియైన చూడక
సాగుచునున్నాడు ♦ సాధుడిపుడు ।
పాపభూయిష్ఠమై ♦ పరగెడు నీభువి
సత్యమిాలోకాన ♦ సాగదింక ।

ఆ॥ వె॥ పాపపంకమందు ♦ బడెనుబో నీభువి ।
ధర్మపథమునందు ♦ దరలబోదు ।

కంచె పెరిగి యణచె ♦ కల్పవృక్షంబును ।
బరమధర్మ మోడి ♦ పతనమాయె ॥

తే॥ గీ॥ రథము వీథుల జనుచున్న ♦ రథ్యలందు ।
సౌధములయందు భూరుహా ♦ శాఖలందు ।
నభ్రపథమందు నల్గడ ♦ నలరువారు ।
పల్కిరా లీల భావముల్ ♦ భక్తిగరుగ ॥

చ॥ చరితమునందు నెవ్వనికి ♦ సాధ్యమదీ విధి సర్వదేశజుల్ ।
పరువముతోడి మన్ననల ♦ బ్రాచి ప్రతీచియు స్వీయదేశజుల్ ।
నిరవధిక ప్రశంస తన ♦ నిర్మలపద్ధతులన్ గ్రహించి యా ।
చరణ మొనర్పజూచి మది ♦ సంతస మొంద మహాత్మునట్టులన్ ॥

తే॥ గీ॥ వృత్రు జంపదధీచియు ♦ వెన్నుటెముక ।
శిబియు దనువును, బిట్టకై ♦ శ్యేనమునకు ।
క్రీస్తు శిలువను బ్రాణంబు ♦ ప్రేమనొసగ ।
బాపు హిందు ముస్లిము చెల్మి ♦ బాసె మేను ॥ 170

ఉ॥ ఈతెఱిమించిపోయినని ♦ కెన్ని యుగంబులు పోగగల్గునో ।
యాతత దేశభక్తియను ♦ నగ్గిని హవ్యములీల దేహమున్ ।
బూతనలీన భావముల ♦ బొల్పుగ వ్రేల్చుఘనున్ గనంగనం ।
చాలటె నాజనుల్ దరుల ♦ యాదల నెక్కిరి బాపుజూడగాన్ ॥

చ॥ పురమున బాటలన్ జనిగ ♦ బూజ్యమహాత్మునకున్ జయంబు శ్రీ ।
కరముగ హిందుముస్లిముల ♦ గాఢపుమైత్రికి జేయుటంచు, సు ।
స్థిరతర నవ్యభారతి వి ♦ శేష త్రివర్ణపతాక నిత్యమున్ ।
వఱలుత జేయుటంచు, సుమ ♦ వర్షముల౯ దగబోసిరాతఱిన్ ॥

శా॥ శ్రద్ధాభక్తులనొప్పి నాజనులు వా ♦ చాతీత ప్రేమోద్ధతి౯ ।
శుద్ధాంతఃకరణాల నా గతిని నా ♦ శూరాత్మ దర్శింపగా ।
బద్ధాంచత్కరులై, మహోత్కటమనో ♦ వైక్లబ్యభారోత్థన ।
వోద్ధూతాశ్రు ప్రవాహదూషితముఖం ♦ బుల్లోల్పుచున్ సాగగన్ ॥

ఉ॥ స్మారకసౌధమల్లదియె • చాందిని చౌకదె, వీనిదాటి యా |
చేరువవీధినే కరుణ•శీలుని సాహసమొగు, వీధులం |
దేరు పదంబు ప్రక్కనిడి • యోరుగ ద [illegible] లేగ గావునన్ |
నేరుపుతోడ సందులను•నిల్పికనుంగొనబోద మీతటిన్ ॥

తే॥ గీ॥ అనుచు వీధుల నరుగుల • హార్మ్యవీధి |
శాఖభాగాల దరువుల • నవనిధరపు |
జతుల దరులందు వ్యోమాన • సకలదిశల |
నిండి కాంచిరి భారత •నేత శవము॥ 175

ఉ॥ ఈవిధి నార్తితో హృదయ•మొంతయు దుఃఖవిశీర్ణభావముల్ |
జీవితరాగపద్మవని • చెల్వొదొలంగ గలంగ బైపయి |
న్దేవగ జేర బైకుబుకు • తెట్టన నందరి యాననంబునన్ |
జీవవిహీన ప్రేతకళ • చెందెను నయ్యెడ జిత్రపద్ధతిన్ ॥

చ॥ అటజని రావిధిన్ జనులు •యారెయనేకము సందుగొందులన్
బటుతరలీలమించు ఘన•పట్టణమందలి తారుబాటలం |
దటమట లేక దాటి ఘన• మయ్యెడివం తెనలెల్ల నెక్కి యా |
కటితమకంబులన్మరచి • కాలెడురక్తపుగోట చేరగా ॥

ఉ॥ రాజులనేకులామెదల • రాజితనాకపథానుగాములై |
తేజము మీఱగాజనిరి • దివ్యమహత్త్వయుతాత్మవృత్తులై |
యీజనవంద్యు, సద్గుణగ• ణేశ్యుని, నీయెడ వీరియందు దా
బూజితలీలను క్తవిధి • బోలునటుండగ, బాడియౌట చేన్ ॥

శా॥ దేశోద్ధారముకై, శతాబ్దివెనుకన్ • దేహాభిమానంబు, లిం |
కాశా సంతతులున్ సువిశ్వల తనాయాభంగుల ద్రుంచనా
వేశోదగ్రమహోర్మిమాలికల, వే• వేభంగులన్ జీవితా |
దేశాలన్ జెనలాటలాడిరిగదా • తేజోనిధుల్ గావునన్॥

ఉ॥ వారలు ప్రాణమానధన •వాంఛలనింక మనప్రవృత్తులన్
జేకి గౌరకేహ్యానయు• సేవితమైన స్వాతంత్ర్యవేష్టిటీ |

తూరతి బద్ధకంకణుఁడై ♦ సర్వముత్యాగమొనర్చియుండి దు |
ర్వారపుఘోరకారగతి ♦ బాల్పడి పాసిరిస్వస్వతంత్రతన్ ॥ 180

ఉ॥ ఈమెడ రాజకీయములు ♦ నెందునుసత్యమహింసయుఁ దగన్ |
బాయక నీతిరాజ్యమున ♦ భాసిలునేవిధినట్లియొప్పగా |
చేయుఁడు, దేవతాంశమున ♦ జెన్నలరారెడు మీరలందఱున్ |
బోవన సత్వరంబెకన ♦ బోయిస్వరాజ్యపుగమ్యమాయెడన్ ॥

చ॥ అనుచువచించి జీవితము ♦ నందున దానినినాచరించి, యూ |
యనువున రామరాజ్యరుచి ♦ యందఱికిన్ దగఁజూపి, శత్రులన్ |
దనవున ప్రేమతోఁగెలిచి ♦ చాతురి 'భారతభూమివీడుడీ' |
యని మనయాంగ్లభూపతుల ♦ నందఱి తక్తులనుండిదింపడే ॥

ఉ॥ అట్టిమగాంధి యీచిరుత ♦ యీభువి, నీఘన కాలవాహిని |
నెట్టన నొక్కపెట్టుతుటిని ♦ నెట్టియనంతసుషుప్తిఁజెందునీ |
జెట్టులుతుల్యులే లలిత ♦ చేష్టన, కీఘనకీర్తి మూర్తికై |
పుట్టున శాంతిసద్వనవి ♦ భాసిత కల్పలతామతల్లికిన్ ॥

ఉ॥ పావనజీవుఁడీతఁడు స్వ ♦ భావజమానిజదేహపాపమున్ |
సేవయు ధర్మశీలమను ♦ శ్రేష్ఠతమాగ్నులఁ ప్రేల్చినాడు; నా |
తావును జేరరాఁడని సు ♦ తప్తగ బంపె తదీయరూపమున్ |
సేవలొనర్ప దివ్యమృదు ♦ శీతలవాతసుహస్తమంటుచున్ ॥

చ॥ అనగనువీచెనామెడల ♦ యామునశీతజలోర్మిమాలికా |
వన సుమహారహారి, మృదు ♦ పద్మ సుగంధ రజోభిషంగమై |
చనియెడి చల్లగాలి. కలి ♦ జాల్మత నెల్లను నొక్కయూపునన్ |
మనుగడలేక మాన్పుక్రియ ♦ మానవమాననమాననీయమై ॥ 185

సీ॥ హారింజి పీధియం ♦ దతిభక్తియుక్తమై,
వైమానికులు చల్లు ♦ విరులవెలసి |
ఢిల్లి జైలులవారు ♦ కొల్లగాఁబెదచల్లు,
పూలగుత్తులతోడి ♦ పూజలందె |

యెచ్చోటఁగాంచిన • నిలయానినటులుండు,
జనమానసంబుల • ఘనతనించి ।
వినువారివీనుల • విభ్రాంతులనుఁజేయు,
జేజేల దిక్కులు • శీర్ణమొంద ।

తే॥ గీ॥ నాల్గువేలగు యోధులు • నడచిరాఁగ ।
వేయి వైమానికశ్రేణి • వెలయుచుండ ।
నూఱు నావికవీరులు • చేరికొలువ ।
పదియులక్షల జనములు • భక్తిఁగనఁగ ॥

సీ॥ దేశచరిత్రలో • దిరముగ వెలుగొందు,
రసపుత్రసైన్యముల్ • రాజిలంగ ।
ననుపమత్యాగాన • కాలవాలంబైన,
మదరాసు సేనలు • కదిలిరాఁగ ।
సునిశితమేధావు • లనఁనొప్పు బెంగాలు
రథములవారలు • రంగుమీఱ ।
జూచువారలచూపు • సుభ్రాంశుకుచులచే
రాజిల్లుకవచాల • రాజిదనర ।

తే॥ గీ॥ రాజప్రతినిధి యశ్వాల • నోజనడవ ।
కాంతునా "జమాయుతు" నెచ్చెక • భటులొనర ।
బాలభటకోటి దిగుఁబున • వచ్చుచుండ ।
వహ్నిరక్షకనికరంబు • భక్తినడుప ॥

ఉ॥ వచ్చె మహాత్మ వాహనమ • వారిత ప్రేక్షక భక్తిభావనల్ ।
ద్రచ్చి, విహాయసంబదర • తజ్జనకంఠ విముక్తరావముల్ ।
నిచ్చలు, 'జేమహాత్మ' కన • నించుచు భూమినినానసంబునున్ ।
జొచ్చి వియన్నదీజలజ • శోభలమాలగ జేయునత్తఱిన్ ॥

ఉ॥ దూరమునందుఁగాంచి జన • ధుర్యుఁడు దారితెమల్పసాగె, దో ।
స్సారుడుసాలటుశేటునట • జాయయుగూతులు, సేనతోడురా

ధీరజవాహరుండు సవ♦ధీరితధీరతమోమువాడగా ।
నూఱడిలంగ జేసెను జ♦నోదధి పొంగులడంగ నత్తఱిన్ ॥

ఉ॥ 'బాపుముఖంబుగాంచిన భ♦వాబ్ధిభరంబు దొలంగ జేయగా ।
నోపును, మామనోజలజ♦యూథము లెల్లను విచ్చియాశతో ।
ద్దీపకశుద్ధసౌరభము ♦ దిక్కుల జల్లగ జేయునందు చే ।
సైపుచు మీరు మమ్ము తుది♦సారి కనుంగొనరీరె బాపునిన్ ॥

మ॥ అనియావేశముతోడ బ్రార్థనలజే♦యున్ బాలురున్ వృద్ధులున్ ।
వనితారత్నములున్ సుశిక్షితప్రశా♦వంతుల్ మహాపూరుషుల్ ।
మనమందంతకుమున్న క్రేళ్ళుగుకుం♦మ్మగాక్రోధయొక్కమ్మడిన్ ।
గనులందాటి మహోగ్రరూపమున నే♦కస్పంద నిస్తబ్ధులై ॥ 190

ఉ॥ నాదుదరిద్రసోదరుల♦నద్దరియుంగను నాపుచాడవా ।
నాదరియుం దెయున్నటుల♦నాథుని మోము చుదోవ, జహ్వారుం ।
డాదరి భావనిస్స్పృహత ♦ నయ్యెడ బొందె, జనావళుల్దగన్ ।
వేదనతోడ బిట్టుసిరి ♦ ప్రేమను బాపుశవంబుజూడగన్ ॥

తే॥ గీ॥ పూజ్య యమునాజలంబుల ♦ బూర్ణకీర్తి ।
తెచ్చి సద్భక్తి, నతపూజ్య ♦ దేహమునను ।
భూమిపైనను జల్లియు ♦ బుణ్యమూర్తి ।
సర్వజనదర్శనీయమూ ♦ స్థానమునను ॥

ఉ॥ ఆశ్రమవాసులా మొదల♦నన్నిభు దేహమునన్యసాధ్యమా ।
విశ్రమదేశమందు ఘన♦విశ్రుతవీరనముఖమందు నం ।
దాశ్రుతిఘోషతోడ హృద♦యార్తిరవంబులు మేళవింపగా ।
నశ్రులధారలాయముల♦యప్పుల నప్పుడు తొంగిచూడగాన్ ॥

ఉ॥ ఉంచిరి దివ్యవాసనల♦నొప్పు శుభ్రసుగంధద్రవ్యశో
భాంచిత గంధకాష్ఠకృత♦మైన శుభోన్నత శయ్యపైన, దీ ।
పించు గుణాఢ్యకాయమును♦ ప్రేమను దీర్చి శిరంబు పెట్టి, య ।
ర్పించిర పెల్లప్రేక్షకులు♦వెంట నియంత్య నమస్కృతుల్ వెసన్ ॥ 195

ఉ॥ రాఘవరామనామశుభ • రావములా యొకమిన్ను ముట్టఁ, గా
నౌఘములింక శ్రుతిశుభోత్తమగానములున్ జెలంగె, నా
హా ఘనభక్తి కౌతుకము • లా యెడ సాగెను నాకనాంబుదో
మేఘ సమానఘోషయును • మేదురమై వినవచ్చె నత్తఱిన్

మ॥ అరరే పెట్టిన మేటి దాటెను బ్రజా • ఘాంభోధి వీచీపరం
పరలా శ్వేత శిరోభి వేష్టన సుధా • వల్యాత్త ఫేనోత్థముల్ ।
వర కాంతుల్ ఘన శాంతి కాంతుల హసిం • పన్వో సమీపించు, నీ
పర మోదారు నివహ్ని సంస్కరణ మా • పన్నారణం బౌనొకో ॥

తే॥ గీ॥ ఏమహా శాంతిపీఠపై • నింతవంత ।
పేరు వెల్లుబ దగియుంగ • సత్యజనులు ।
సందరిమై మునుప గర్మమున్ • సాగదేమొ ।
మాతకౌగిటిలో బిడ్డ • మరణ మగునొ ॥

ఉ॥ అంతట మాంటుబేటను సహా • యుత సుశిక్షిత సైనికుల్ మహా ।
శాంతతతో సుదారగుణ • చాతురితో ఘనదర్ప మొప్పగా ।
వంతమునింగియున్ జనసు • భావసముత్థిత వార్ధిఁ దిగ్గమున్
వింతగ నద్దుకట్టవలె • వేగ నసంగ నె సాగెగర్మముల్ ॥

ఉ॥ రాముని నామమే ధనము • శాస్త్రవ్యాసు వేదపుస్తకంబుల్ లే ।
నీమమతోడి గానములు • నిత్యము వానినె యభ్యసించు, నా।
రామశుభాంకశర్ముఁడు • రాజితలీల బరింపనాతఁడున్ ।
ధీమతి రామదాసుడు విధిన్ బొనరించెను గర్మముల్వడిన్ ॥200

ఉ॥ గాంధిమహాత్ము పూతతమ • కాయము నెయ్యది కప్ప జేర్చిపై ।
గంధసుమాల్య లేపముల • గాంచుజనించెడి పూజ సల్పిరో ।
బంధవిముక్తుఁడై యతని • భావమునందెది చిత్రితంబొ, యా।
బాధవినాశినా భరత • భాగ్యపతాకను బూన్చి రావయున్ ॥

ఉ॥ చేరిన రాయబారులను • జెన్నువహించిన మానికంబు నా ।
వీర 'చిలూయిలో' యపుడు • విస్మితమైన జనాళి యాదరం ।

బారని గౌరవంబుల ననన్యవిధిన్ వెలిబుచ్చి శాంతితో ।
ప్పారెడు పూలదండనిడె భారతభాగ్యవిధాత సన్నిధిన్॥

తే॥ గీ॥ రాయబారులెల్లరునట • ప్రథితభక్తి ।
వారి దేశాలఘనతను • గౌరవముల ।
సూచకములైన సుమహార • సూచనలను ।
పాదసన్నిధినిడగ న • పారమాయె ॥

ఉ॥ ఇంతని సర్వకర్మమును • నేర్పడ ముక్తవిశేషబానర్చియ ।
త్యంతసుదుస్సహంబగున • యగ్నిశిఖల్ శిరసున్ దగుల్చుటల్
నంతనొనర్చె శీర్షపద • భాగములెల్ల వణంకనప్పుల ।
శాంతముకన్నుదమ్ముల విశాలదళంబులనుండి రాలగన్॥

ఉ॥ న్యాయపథానుయాయులగు • నట్టిమహాత్ముల గారుగానకే ।
పోయెడి గుడ్డిలోకమున • బొల్పగువారల గాంచె జోతులన్ ।
బాయ నతండు, వర్ణగుణ • భావమొయుంగుచు ధర్మనిష్ఠతో
చేయగ వైశ్యమానిడగ • చేరిన వైష్ణవు దేగుడెంచగాన్॥

ఉ॥ మాటలు రాజనీతి శుభ • మార్గములందలి దివ్యదీపికల్
బాటలు సత్యశోధ్యసిత • భారతి దివ్యపదప్రవృత్తులన్ ।
మాటలు బాపునీతులక • మూల్యపువ్యాఖ్యలమాల్య దేశముల్
తేటవెలుంగు సూక్తులకు • దివ్యసుపేటిక లీమనీషికిన్॥

ఉ॥ పూటిచరిత్రఘోరవధ • పూర్తిగ నెంచగిన గ్రామవాసులా ।
లేతమనంబులోకృపకు • లివ్యననిస్పృహ జెంద, స్వీయమా ।
ప్రాతగు గోఘృతంబుగను • బావలదెచ్చి మహాత్ముమంటలు ।
దాతతభక్తితో నచట • నాచికినాసలు జేసిరయ్యెడన్ ॥

ఉ॥ వేల్పనమంటలాకసపు • వీధులబర్వగ, నల్లపేషుకుల్
నిల్చిరి వేమహాత్ముతయి • నిస్తులభక్తితరంగితంబుగా ।
దాల్చిరి శాంతదూతకయి • తాల్మిని నేకని మౌనమానమున్ ।
వాల్చుచు మస్తకావళిన • వార్యసునిశ్చలచిత్తవృత్తులన్॥

ఉ॥ ఆసమయాంతమందున మహాత్మ! యతీతగుణాభిరామ, య ।
భ్యాసనియుజ్యమాన నిజపావనజీవిత సర్వకార్య! వ్యా ।
త్యాసవిహీన వాగ్విభవ, ధర్మమనోజ్ఞ సువృత్త! యీనరా ।
వాసము వీడిపోయెదవె? పాపిని మే నినుజూచు భాగ్యముల్ ॥

ఉ॥ ఆదరభావు డా ఘనుడు మా మన భారత భాగ్యయాత్రముల్ ।
వేదనియుక్తసత్యము, విశుద్ధసదర్థ అహింసమార్గమున్ ।
నాదుచు దీవ్రవేగమున నవ్యనవీన స్వపథంబు జేర్చె, యా ।
మీద సురాజ్యసిద్ధిని సమీతి మొసంగిన బాపు లేడికన్ ॥

సీ॥ దక్షిణాఫ్రికయందు దనను మోదు మొనర్చె
ననికొట్టు ముస్లిమునగని నెడి నగవు ।
పరదేశవస్త్రాల పావక జ్వాలల
పాల్సేయుపట్టున బరగు నగవు ।
తన్నవకేదోసి తిన్న చుమ్మిసిన
యతని క్షమించుచో నమరు నగవు ।
అతిథి భక్తిని కోర్కె నాభరణాలిచ్చు
చిన్నపిల్లగోసరు వన్నె నగవు ।

తే॥ గీ॥ స్త్రీలు తమ మేలి నగలెల్ల దేశమునకు ।
సిలువ పోపు గాపించ నిలువ నిలిచినీవు ।
ప్రేమదళ్ళోకర్త గుంగించు ప్రియపు నగవు ।
గాంచ మాకింక గాంచ మా ఘనుని నగవు ॥

చ॥ పరగబడాలు నేల కృపాభాగము లెంమున వేణుహస్తుడే ।
తిరిగి మోహనాంగుగని తేరిరి ద్వారక సన్మునీశ్వరుల్ ।
తరముగ భారతావనిని దివ్యసువేణువు మోహనాంగముల్ ॥
వరలక కోట్లవాక్ప్రథను వాంఛలదీర్చు మహాత్ముడే గనే ॥

ఉ॥ ఏరికి నెట్టికష్టములు నే సమయంబున జేయునట్టి నీ ।
వారయ మాహృదంతరములందున దుస్సహ దుర్నిరీక్ష్యమా ।

చ॥ హరిజనులేగ రానిజగమందున ♦ నాహరియుండఁబోఁడు; నే
నరుగగఁబోవనయ్యెడకు ♦ నాహరివారసులేగకున్న సు ।
స్థిరమతి నంచు మానితిరి ♦ దివ్యగళంబునఁ జూడ; నట్టి సుం ।
దరహృదయాబ్జులైన,తమ ♦ దర్శన మేఁ అవౌనె యూపమున్ ॥

శా॥ తల్లీభారతమాత నీసుతుని మా ♦ దన్నన్ మనీలోకమం ।
దుల్లంబుల్కడు వ్రీలగా నటుల ♦ శోకోదగ్రభావంబుతే ।
తెలంబానటు సర్గచేత ననమ ♦ స్థిత్యంతహాకారము ।
ద్యల్లీలందివిదిక్కులన్నదుల ను ♦ ద్భ్రాంతి న్దగంజేసెడిన్ ॥

క॥ నగవుల ♦ నడతల గ్రియలను ।
వగలను, జతురోక్తియుక్త ♦ వాక్యచరనలో ।
దగవుల ♦ వ్యాపారంబుల ।
జగముల నీసాటి యన్య ♦ పరసుండేడీ ॥

సీ॥ 'తమ్ముడా'యని యొక్క ♦ గార్భాగ్యబిలదిన
సద్గుణంబులవన్ని ♦ చక్కపచ్చు ।
'ఈయరా'యని చేతి ♦ నింపుగా జాపిన
పీనాసి యౌదార్య ♦ విలసితుడగు ।
ప్రేమజూపుటె ధర్మ ♦ విధమని చాటిన
బెబ్బులిభాగంబు ♦ బీతిజూచు ।
నామాటవినరన్న ♦ యార్యలోకంబెల్ల
బాచమువర్ణంబు ♦ బైకినీయు ।

తే॥ గీ॥ నౌర మాత్రింబా, మాయమో ♦ యింద్రజాల ।
కాయోక క్తిక విజ్ఞాన ♦ చతురబలమొ ।
లేకయున్నయు రూ ♦ పాందెనోకదయ్య
అట్టి శ్రీగాంధి నేటితో ♦ నవని లేవె! ॥

ఉ॥ ఈవిధిబల్కుచుం గనిర ♦ హీనగుణాఢ్యునియంత్యసత్క్రియల్
భావవిషణ్ణులై ప్రకృతి ♦ బాధవిదారణజేయు పద్ధతుల్ ।

భావముల్ దలంచుచును • భాష్పసమన్వితనేత్రయుగ్మలై ।
భావములం బొనర్చు మగ • వంబుఁ ద్రిప్పుచు దుఃఖమగ్నలై ॥

ఉ॥ మామ్ముఁ బిలిచ్చి ప్రేమరస • మాధురి మా హృదయాలఁ జొన్పి స ।
త్యమ్మునను, ధర్మమే సరణి • నాచరణంబున గొప్పనట్టి, మా ।
ర్గమ్మును. జూపు బాపిటుల • గన్నులఁ గన్గ నవీనయుంచు భా ।
వమ్మున నెంచు బాలికలు • బాహుల గుచ్చి పటేలు నయ్యెడన్ ॥

తే॥ గీ॥ మీరలేకాదు దళిత • నేరకుండు ।
నిలచియున్నట్టివాడను • నేనుగూడ ।
సబలసమమైతినని చాటు • సతిని బోలె ।
జాలనొప్పె పటేలంత • బాలతోడ ।

శా॥ మంటల్ వ్యోమము పీఁధుఁన్ బరువద • న్మధ్యస్ఫురత్కాంతితో
మింటన్ బర్విడి రవ్వలొప్పన చటన్ • మేకొన్న క్రొంజీకటిన్ ।
మంటంజెందు మహాత్ము చెయ్యెల సితం • బా భావిచారిత్రిల ।
న్నింటన్ ద్యాగపు చిహ్నలోపటులె క్రీ • తి వ్యాల్గుగాయన్న టుల్ ॥225

శా॥ జ్వాలల్ ప్రొంగి మహాత్ము దేహమను హా • వ్యంబున్ దగన్ వ్రేల్చి, న
చ్ఛీలుం డగ్గిని నేరత న్బరయగా • దివ్యుల్ శడున్ హవ్య సే ।
వా లోలత్వమునం జెలంగగను న • వ్వారిన్ దగన్ దృప్తి. దా ।
లీలం జేయగ రువ్వు హవ్య కబళా • లే నారవల్ ప్రబల్పెడిన్ ॥

మ॥ త్రిగమై, రూపవిహీనమై చనెనయో • సచ్ఛీలు దేహంబిటన్ ।
పరపుణ్యాత్ముని దివ్యభావములనే • వాగ్రూపలాలిత్య, సు ।
స్థిరవిజ్ఞానసుమాతృకంబులయి యొం • తే శుభ్యాలంకారమై ।
తరలున్ గ్రామిక నేమి శాశ్వ్యమని చిం • తా మగ్నుడయ్యెన్ పటేల్ ॥

ఉ॥ ఈవిధి భూమియాకసము; • నేడ్తెఱి స్వర్గము; క్రిందిలోకముల్ ।
పైవని యుక్తమై పరగు • ధర్మము సత్యము పుణ్యపాపముల్ ।
భావి క్రమాగతంబులగు • భారతరాజ్యయశోనాడ మి ।
ప్లేవరత విక్రమంబు దమదీ • నెంచు చటుల్ బడు రీతినుండగాన్ ॥

గనినదినమ్ము జాలక వ•గన్ జగమొక్కటియౌనొ, యాత్మయౌనా ।
జనునొకొ మిథ్యయైయును విచారతమిస్రనిమగ్నులైరటన్॥ 235

చ॥ నియతతరస్ఫుటంబయిన • నిర్మలకోమల దివ్యపద్మమా ।
భయదనిదాఘసూర్యకర • పాళిని గాంతి దొఱంగినట్టులన్ ।
సమవిషమాన్వితుండగుచు • సానుజహ్వారు మోముదమ్మియా
డయితుసిబాయుగాతిరిసి • దాదశవత్సరశోభ గోల్పడెన్॥

చ॥ జనులసమాజమందులను • జాతులసందులనన్నివైపులన్ ।
జనుచు జనాళిసభ్యుచిత • శాంతినివర్తిలజేసి, బాపుపై
ఘనఘనదిపారగా, నిలచు • మానముదాలుచు, బొమ్మరీతిగా ।
గనబడు శాంతిహీనత వి•కారముజెందును జవ్హారాయెడన్॥

ఉ॥ పీరలునేగనొక్కపరి • పింగవరేణ్యుని భస్మరాశికిన్
జేరినమస్కృతుల్గను • జేసియు, దగ్ధనుస్పృశ్యభాగ్యవి।
స్ఫారసుపుణ్యభాసురుల • తాంతమునో యొకరేకనో తుదిన్
దారమునో శిరోజమునో • ధన్యతగైకొని యేగగోరెదన్ ॥

చ॥ అనుమతి నెవ్వరున్నదల • నాయెడ నెన్నరు, మానముద్రలో ।
గనుగనమూసి భాష్పజల • కంబులు తద్ఘనుకాన్కచింతనం ।
బునులఁగలంజనంగనవి • యుంచితరీతిని బెట్టుకొన్నవల్ ।
మానముద్రఁ జాకిసి • గ్రథముగ • మానుగ గూర్చినొ స్రబ్భవన్ దగన్॥

ఉ॥ ఎచ్చటనున్నవారమెయి • కేస్థలికిన్ జనువారమో, కటా ।
సచ్చరితుండు చక్కగను • జాటుతరంబగు సత్స్వరూపమున్ ।
ముచ్చటగాంచుచున్ మహితు • ముద్దుమాటల హింససూత్రముల్ ।
నిచ్చలుపన్యసింపగను • నేరముగాగలవైననోచమో ॥ 240

చ॥ అనిలలపోయగానదియు • నాశయబద్ధమెకాగ, నాత్రినే ।
మునియయినన్ దపోనియము • పూర్ణితభస్మమునుండి బాపుగన్ ।
మనకొనగంగ రాదొయకు • మానసమందుల, నక్కయాశగా ।
గను బ్రతిమానవుండటను • గాలుకదల్పడ దేమిచిత్రమో ॥

ఉ॥ ఎల్లరు క్షేమతో సుహితు ♦ నేర్పడ సూచన జేయు ద్రవ్యముల్ |
సల్లలితంబుగా గొనిన ♦ సాక్ష్యముగానిక భావివారికిం |
కెల్లనినేమియుండదిట ♦ నింతక భస్మము దైన నెత్తగా |
జెల్లరా! దానినాసనిట ♦ జెప్పుడిరక్షక సైన్యమీయెడన్॥

తే॥ గీ॥ అనుచు జవ్వారు సర్దారు ♦ ఘనుడు మాంటు |
బేటనాతనిసతియును ♦ బ్రియమెలర్ప |
రాజగోపాల ప్రభృతులు ♦ నోజబల్క |
నటుల నియమించి ఘనులెల్ల ♦ నరుగనున్న ॥

ఉ॥ అంతమహాత్మునంచయన ♦ మచ్చటమూడవనాటి పొద్దుటన్ |
శాంతవిశుద్ధమానసము ♦ సాదరభక్తి ప్రసన్న భావముల్ |
చింతనడంపగా వచన ♦ సీమయు గద్గదికంబ్రివాత మ |
శ్రాంతమునూపుకోమలవ ♦ సంతలతందలపించియొప్పగాన్ ॥

తే॥ గీ॥ జరుగువని పల్క నాయెడ ♦ సారగుణుడు |
కర్మజరిపెడివాడు ప్ర ♦ కాశకీర్తి |
రామదాసు కుంచింతాభ ♦ రమ్ము లోన |
జిత్తదార్ఢ్యము మెఱుపునా ♦ జీకటిదగ ॥

సీ॥ అలవసంతంబులో ♦ నడయాడు పద్మిని
నెడబాయు నవపద్మ ♦ హితుడనంగ |
సర్వవిద్యలాసంగి ♦ సాకు సద్గుణునోజ్జ
సత్కరింపకయేగు ♦ ధాత్రిడనగ |
మధురసయస్సుల ♦ మానుగా ద్రాగియు
జన్ను గుద్దిన కూర్ర ♦ చరితుడనగ |
సకల శక్తులాసంగు ♦ సర్వేశుగానక
మాయోపహతుడైరి ♦ మనుజులనగ

తే॥ గీ॥ నచటజేరిన జనముల ♦ ల్లంతనంత |
ప్రేమబంధంబు లోకవైపు ♦ ప్రీతిలాగ |

పరికృతి బాధలింకొకయెడ ♦ బరిఢవిల్ల!
నరుగ మొదలిడిరిండ్లకు ♦ నధిక చింత ॥ 245

ఉ॥ కొందటికింత కాలమిటు ♦ గూర్మిని వేచిన బాపు దర్శనం ।
బొందగ నోచమంచు మది ♦ బొంగెడి దుఃఖసముద్రవీచులన్ ।
గ్రందుగ నున్కలంది, నిజ♦ కాంతల కూతుల హాసశోభలం ।
జెంది వెలుంగు సంసరణ ♦ సీమలదాటి గృహాల జేరగన్ ॥

ఉ॥ అంతట బాపుజీ తనువు♦నందుల ప్రేమ మదిబ్బడింపగా
నంతట దివ్య పూరుషుని ♦ యాదరమే యొక రాత్రి నిద్రనో ।
క్కింతగ మాని యాతనికి ♦ నేక ప్రియంబగు నట్టిదానిగా ।
వింతమటంచు గొందఱట ♦ వేగ సుభక్తి నియుక్త చిత్తులై ॥

ఉ॥ రాముని నేస్మరించు మట, ని♦రంతర రాముని నామ కీర్తనం ।
బాముని వంద్యు సేవయు మ♦హామహు గోపకిశోర సూక్తులన్
నీమమునన్ మహాత్ముడు పు♦నీత వచః పఠన క్రియావళుల్ ।
ప్రేమమునం బొనర్చిరి స♦రేంద్రకులస్థైనను గాని పద్ధతిన్ ॥

తే॥ గీ॥ రేయి యంతయు జనము లా♦రీతి గడుప ।
దివ్యకాంతులు నల్దెసల్ ♦ తేజరిల్ల ।
జల్లు దినమణి, జ్ఞాన భా♦స్కరుడు లేని ।
యుర్వినొల్లక మంచునం♦దుదయ మయ్యె ॥

సీ॥ కన్నీరు కాల్వలై ♦ కారంగ దుఃఖించి
యామిని జాగర ♦ మమర జేసి ।
పకారము నువిన్న ♦ నెలుగెత్తి బాపుజీ
యనియార్చి లేడంచు ♦ నలమటించి!
కాశ్మీరునం దేమి ♦ కావింతునని ప్రశ్న
గావించి కలయంచు ♦ గలతజెంది ।
పంజాబు పడతుల ♦ పరువును గాపాడ
నేకై సైనిక సేన ♦ లేక క్రుంగి ।

తే॥ గీ॥ నిమిష మొకవత్సరంబుగ ♦ నిశియొయుగము |
గాగ నెటొ కాఁపుచునీ ♦ గడపి వేగ |
కనులబడినన్ని సుదినముల ♦ ఘనత హెచ్చ
ములుగ జేకొని జవ్హారే ♦ ముందునడచె ॥ 250

ఉ॥ పండితుకంఠముందుగను ♦ బంతులు, నాతసిక నన్ను ముందుగా |
నుండెను రాజఘట్టమున ♦ నుత్తముడౌ యగాంధిబాపు; నూ |
త్నాండుడు ప్రాక్యదిక్శిఖరి ♦ దానఘరోహణ సేయుచుండ నే ॥
దండలుగొంచు దండలుగ ♦ దాజనకోటియు జేరె నాయెడన్

ఉ॥ స్వస్తిదగన్మహాత్మునకు ♦ భారతదేశనవప్రపక్షకు |
భ్యస్తసమీన రాజ్యపరి ♦ పాలన మార్గవిలాస వృత్తికిన్ |
న్యస్తసమస్తనాగరక ♦ నాయకమస్తకసత్యసూక్తికిన్
నిస్తులభక్తిసంభరిత ♦ నిశ్చలతన్ మనసార మ్రొక్కెదన్ ॥

తే॥ గీ॥ అనుచు జోహారుగావించి ♦ యుబకు హార |
మాత్మకనులకు నద్దుచు ♦ నధిక ప్రీతి |
జవ్హారాదరిమనుచె నాంజాతి పితకు |
జితిని జనులు మహాత్మకు ♦ జేయనంగ ॥

ఉ॥ స్నానముజేసి శాస్త్రవిధి ♦ జానగుకర్మము రాఘుదాసునున్ |
మానుగ దేవదాసుసును ♦ మౌనవిధిన్ బొనరింప నాత్రితో |
గానముజేసి రాజనుల ♦ కంఠములా శుభవేళయామునా |
సోనలనానినీటిపయి ♦ సోలెడిహంసలగాన మోయనన్ ॥

సీ॥ భారతీయులఘోర పారతంత్ర్యమురూపు
ముద్రించి చూపిన ♦ ముకురతలము |
తెల్లవారల స్వార్థ ♦ తీవ్రస్వరూపంబు
పొలుపొంద బూచిన ♦ కలుషతరువు |
హిందు ముస్లిముసంఘ ♦ మందు నేకత్వంబు
లలమించు కాకలు ♦ వెలయు తావు |

హింసాపథంబుల ♦ ధ్వంసంబొనర్చెను
ప్రేమ మార్గ మాహాత్మ్య ♦ పెరుగు నెలవు!

తే. గీ॥ దివ్యమౌ స్వాతంత్ర్యతటికి ♦ దెల్ప మునుగు |
వేసి ఘోషానుగమరాగ ♦ వేయు సీమ |
అట్టిదగు దక్షిణాఫ్రికా ♦ నలుగు నేత |
రుస్తుమే తెంచె బహుళార్తి ♦ రుద్ధగళుఁడు ॥ 255

ఉ॥ జాతిమతాదిభేదములు ♦ చక్కికి బోవక సర్వమానవుల్ |
భ్రాతలటంచు జాటియును ♦ రాగసమన్విత నిత్యజీవిత |
ప్రీతముఖండఖండముల ♦ వారల దైనిక జీవితాలకున్ |
నూతనశోభనిచ్చిన మ♦నోహర దీపిక యారిపోయెనే॥

ఉ॥ ఒక్కట దేహమందెటు న♦టో తనత్యాగతతీప్రభావమున్ |
విక్కటిలంగ జేసి, తను ♦ బ్రేమను ముట్టినవారి నెల్లరన్ |
మిక్కువ దత్ప్రభావయుత ♦ మానితజీవుల జేయు వ్యక్తి తా |
నక్కట స్వప్రభావహతి ♦ నారయ నీవిధి భస్మమాయెనే॥

చ॥ అనుచును దుఃఖపూరిత మ♦హార్ణవమందు మునింగి పూనికన్
మానముగ లంగియున్నపాటి ♦ మున్నన రాఘవరాము కీర్తనం |
బను నొక వాతపోత మహిమా♦స్తిని నొద్దున కెక్కనాశయా |
లను నొక సైకతస్థలిని ♦ నత్రతి జేరి నిమీలితాక్షులై

ఉ॥ ఉండెను బ్రార్థనోన్ముఖత ♦ నోసిన కాలము, రామనామమున్
దండిగ బారవశ్యపర♦ తన్ ధ్వనియించిరి, దానియంత ము |
న్నొండు వచింపకా జనము ♦ లుత్సుకతం దగ, సంజప్రార్థనల్ |
మెండుగ జేయువారట ♦ మేలుగ గాకని యేగిరింట్లకున్ ॥

ఉ॥ సాయంకాలమునందు, సన్మతిని నా♦సాధూత్తముండెట్టులన్ |
జేయున్ ప్రార్థనలోకనాయకునకున్ ♦ జిత్తాబ్జముల్ విప్పి, త |
ద్ధ్యేయస్వామి మిళిందరూపమున నా♦దివ్యాబ్జమాధుర్యలో |
లాయత్తుండగునట్టులట్టులె యొన♦ర్చన్ జేసి తా ప్రార్థనల్ ॥ 260

సీ॥ తెలతెలవారగా ♦ దివ్యతరంగిణిన్
యమునలోస్నానంబు ♦ లమరజేయుటఁ
జేసి పావననది ♦ చెలువంపుజలముల
నన్నిదిక్కులయందు ♦ న మరజల్లు।
జల్లి సుందరపుష్ప ♦ సౌభాగ్యముల నెల్లు
హారంబులంజక్క ♦ నమరగట్టు।
గట్టి కావునకివ్వి ♦ ఘనమోద మొనగునో
యాపట్టులందీసి ♦ యమర జదువు।

తే॥ గీ॥ జదివి నేఁడెనంచయనంబు ♦ సకలజనులు।
వారులందఱ్చి మోములు ♦ వాడియుండ।
వచ్చుచున్నారుదూ రాన ♦ వటులు కారు।
చకచకలు వారిరాకను ♦ జాటుచుండె॥

ఉ॥ అక్కట! ధర్మవీరువలె ♦ నామహాసీయుని చావువిన్న నే।
నిక్కము దేహమున్ విడువ ♦ నేరకయుంకుటలిట్టిపాపమున్।
ప్రక్కకచూచుచుండుటకె ♦ చోద్యములారయ దేవుకార్యనుం
దెక్కడగన్నద్వంద్వములె ♦ యేర్పడునంచొకభక్తుడాడగాన్॥

సీ॥ ముప్పదేడులు విజ్ఞ ♦ లొప్పగ దేశపు
స్వేచ్ఛకెయుద్యమాల్ ♦ చేయురీతి।
కరుడుగట్టి రవంత ♦ కదలింపగారాని
యాచారములనెల్ల ♦ నూచు విధము।
రవి యస్తమింపని ♦ రాజ్యపాయువుపట్ల
నొక్కమ్మడిగదల్ప ♦ నోపు విధము।
సకల సద్గుణముల ♦ నొకపరి సభ్యాస
మొనరించు నొకమతి ♦ నొప్పుపంథ।

తే॥ గీ॥ రాత్రియుండెల్ల మదినెంచి ♦ నేత్రములను।
నేకధారగ నశ్రుల ♦ నెలమిగార్చి।

భారతీదేవి వాగ్రాణి • సజలంపిలువ |
శ్రీసరోజినివచ్చె లో • కజంతగలిగె ||

ఉ॥ హైందవుడన్ననామమో, మహమ్మదువారివిధానమమ్మలన్ |
గ్రందుగగష్టకాలముల • గాచె, హితంబులగూర్చె ప్రేమతో, |
వందనయోగ్యులౌను గదు • వంద్యుడికీతని నామ గౌరవం |
బందగ జేయువాడనని • పొక్కుచు నగ్బరు హైందకేగిరిన్ ॥

సీ॥ హిందువుల్ హెచ్చుగా • నుందురే మారాజ్య
మందేమి సఖ్యము • నందలేదె? |
మీరాజ్యములలోన • మేకొని యుండుచు
మావారు ప్రేమతో • మనుటలేదె? |
మానమందఱముకూడ • నొనరగ హైందవ
బీబీకి సంతుగా • వెలయవలదె? |
మీరామవాసుని • మెచ్చి మా తానీష
యేటేటనుత్సవా • లేటిజేయు |

తే. గీ॥ మాంసమందున మాంసంబు • మనము మీర |
లనుచు ననురాగవిభవంబు • దనరజూప |
జారు విభవానజెండాను • జగ్రదరేఖ |
వెలుగనై జాము రాయబా • రిలలివచ్చె ॥

ఉ॥ మంత్రిలవర్గమా మొదల • మాన్యగుణాన్విత రాజ్యకోవిదున్ |
తంత్రితమో వినాశకర • ధార్మికసూత్రవిధాతృపూరుషున్ |
యంత్రితవితండవాద పరి • హాసవినిర్గత జీవితాశయున్ |
మంత్రివరేణ్యు పూర్వులయి • మానుగవచ్చిరి గౌరవింపగన్ ॥

ఉ॥ అంతన రామదాసుడును • నాతని తమ్ముడు దేవదాసుడున్ |
వంతగలంగుచున్ యమున • వారిని స్నానమొనర్చి భక్తితో |
నంతట బాపునస్తులట • నగ్నిహుతంబవ, శేషభాగమ
త్యంత విరాగభావసహి • తాదరయుక్తిని బోగుసేయగన్ ॥

సీ॥ సత్యాగ్రహంబుల • జన్మతావలములు
ధర్మదేవత మెట్టు • స్థానములును ।
పారతంత్ర్యమడంచు • పటుయంత్రశాలయముల్
లోక కళ్యాణ దీ • క్షాకరములు ।
సత్యాగ్రహోదార • జలములూరెడిచోట్లు
హాస్య శాంతలత • లలరుతరులు ।
ఋజుమార్గగమన • సంస్కృతి విరాజితములు
దారిద్ర్యదుఃఖుల • తపసు ఫలము ।

తే॥ గీ॥ లై వెలుంగు మహాత్ము దేహంబులోని ।
వివిధకంకాళశేషముల్ • వేలు వేలు ।
రామనామాంకితంబైన • రాగిపాత్ర ।
బొంద్రవుసేసిరి కసిన్న • పౌరలి పాగ ॥

ఉ॥ ఎన్నడొ చిత్తజన్ గెలుచు • నీశ్వరకర్తృక భస్మరాసులన్ ।
గ్రన్నన భారతీయులు క • ంబు ముదంబున దాల్తురిప్పుడున్ ।
మన్నన ప్రేమయష్టిని ప్రగ • మంబుగ త్యాగమహాగ్ని భస్మమై ।
చెన్నుగ హిందుముస్లిముల • స్నేహము వృద్ధిలజేసెనిత్తఱిన్ ।

ఉ॥ కావున భస్మరాసులను • గాంచుచు భావితరాల వారికి ।
శ్రీవసుధాస్థలిన్ వెలయు • నీమెడ రానిజనాళికిన్ దగన్ ।
సేవలొనర్ప గోరు, పర • సీమలనుండెడి యేకలవ్యులా ।
సేవకపాళికిన్ బ్రియత • జేర్పను సంమలనింత మూతలిన్ ॥

సీ॥ స్వచ్ఛచారిత్రంబు • వఱలునిట్టులె యనన్
ధవళకాంతుల గడుం • దనరుదాని ।
సకలదోషంబు లీ • సంపర్కమున బోవు
నన బాపగృహముల • నొనరుదాని ।
పుణ్యపూరుషులందు • బొలుపారునభిమాన
పూజాస్థలంబున • బొలుచుదాని ।

దేశసేవకులెల్ల • దేనిచే మాతను
బూజించి చరితార్థ • మునుగనుదురొ।

తే॥ గీ॥ అట్టి మేలైనఖద్దరు • నధికభక్తి।
సంచాలన్నేసి యవ్వాసి • జక్కనత్తి।
పుణ్యభస్మంబు దేశాల • బోలునంప।
ననుచు సింపిరి జనముల • స్వాంతభక్తి॥

ఉ॥ ఆగుడి యేదియో యిటుల • నద్భుతవేగపరీతగామియై!
యేగెను భస్మరాశికిట • నించుక క్రిందుగ, నద్ది వృశ్చికం।
బోగెడపక్షి ముఖంబు మన కొయ్యనజూపక యెక్కడెక్కడో
దాగుచు బాపకృత్యముల దార్కొనుదుష్టుని చిత్తమట్టులన్।

తే॥ గీ॥ అనిననాపిరి భస్మప్రయత్నమపుడు।
భస్మరాశికి నడుగున•బట్టి తిగచు।
వేగనావిష్కరించిరి • విజ్ఞబోట।
బెట్టుకొనినట్టి యొకగుండు • భీతిగదుర।

తే॥ గీ॥ దిక్కులేనట్టిగనులలో • దేటలేక।
పోల్పగారానిరూపాన • బొలుచుచుండి।
యాతనంబడియెల్లెల్లా • యలరుచున్న।
మానవైతివి నీదుష్ట• షుతిని గుండ!॥

తే॥ గీ॥ భస్మమందుననీవిట్లు • వఱలుచుంట।
నగముపాసెను నీపాప - జాతి కలువ।
మికను నాగంగజలముల • నకటమిశే।
మైన మిగిలిన సగమది • యణగదొక్కొ॥

క॥ అనుచును గలగల జెలగుచు।
జనములు జలజలను గనుల •జలములు గలుగన్।
మనముల గలకలు దొలగగ।
ననువుగ దుదిపనుల మఱల • నలరిరి కలకన్॥

తే॥ గీ॥ అట మహాత్ము సంచయనంబు♦నాఁగ వసట।
జెందుచుండియు జనములు ♦ సేయుబూర్తి।
దేవదాసిట్లు పలుకఁగ ♦ దివిరెనప్పుడు।
మనమునందలి దుఃఖంబు ♦ మాటుచేసి॥

సీ॥ అవధరింపుండయ్య ♦ యార్యసత్తములార!
దేశసేవాసక్త ♦ ధీరులార!।
దేహంబుదాల్చి వ♦ ర్తించుస్త్యాగములార!,
మర్ధింతాఖిలదోష ♦ మహితులార!
నియమిత జీవితా♦శయ నిత్యాగతులార!
ధర్మతత్పర మనః ♦కర్ములార!।
ప్రేమనిర్జితశత్రు ♦ భీకరగుణులార!
రాజ్యలక్ష్మీ నూత్న ♦రసికులార!।

తే॥ గీ॥ హిందు ముస్లిము స్నేహ మ♦హీజ మృదుల।
వృద్ధోహదకరధీర ♦ పురుషులార!।
నాదువచనంబులింక మ♦నస్సరోజ
సీమలందున వెలుగొంద ♦ జేయురయ్య॥

ఉ॥ ఘోరపుగార్యమీాయెడల ♦ కొంచ్రివిధాన్ సమకూడె నెవ్వరీ।
తీరున లోకపూజ్యు శుభ♦దేహము భూమినివార్తిలునంచు,నా
కూర్తిరుడు కు,టనీవిధిని ♦ రూఢిమెునర్చుట సాధ్యమానటం।
చూరయునెంచినారలహా♦హా కడు మానసవీధి బ్రీలెదుర॥

తే॥ గీ॥ మా గురూత్తముడందిన ♦ మరణమునకు।
వగవ, దైవసంపత్తితో ♦ ఁజలు నతడు।
విశ్వదర్శిత సర్వప♦నేను డగుచు।
నమలుడౌ మ స్థిత ప్రజ్ఞ♦డై చెలంగె॥

ఉ॥ ఈకడుకష్టకాలమున ♦నియ్యెడ మాకును, నెల్లవారికిఁ।
శోకమడంగగా గమల♦ సోదర కోమల చిత్తసీమలఁ।

ప్రాకట వాక్ప్రసూనముల ♦ బంపుహితాళికిబంధుకోటికిన్ ।
లోకహితైకకాంక్షులకు ♦ లోలితబాలితకోటికిన్ దగన్ ॥

ఉ॥ ఈతటి వందనమ్ములివి ♦ యే కొనుడయ్య మదీయ చిత్తమం ।
దాతత దుఃఖదుస్సహా, మ ♦ హానల దీప్తియహర్నిశంబులు ।
బ్రాతల నూచుచున్నదిక ♦ యూఢిని గొన్నిదినాలు పోగనే ।
జూతును జాబులందఱికి ♦ జొప్పడ జేర్పక్షమింపుడీతఱిన్ ॥

ఉ॥ ఇప్పుడు మంత్రియుక్తముగ ♦ నిస్థలమందున బాపు దేహమున్ ।
నిష్ఫలభస్మమా యొనిక ♦ నీటుగ దీసి ప్రయాగసంగమం ।
దెప్పు పుణ్యతోయముల ♦ నవ్విధి మిశ్రము సేయువారమా ।
తిప్పక యల్పకాలమున ♦ దాపక చాటెదనున్నిసీమలన్ ॥

ఉ॥ ఆరకయొక్కపద్ధతిని ♦ నశ్రిని చిత్తిన్ బహునాల్గుగంటలో ।
ప్పారెను గీతజాలలు వి ♦ హాయసవీధులవిభ్రమింపగా ।
సార మహీసురప్రవర ♦ చారుసునాదపదానుకార శో ।
భారమణీయమై శ్రుతులు ♦ పావనగీతిలు కొప్పుచుండగాన్ ॥

ఉ॥ ఆతఱి మీరలందఱును ♦ నాదరపూరితచిత్తపద్ములై ।
హీతవిరోధులై సుజన ♦ బృంద సుహృజ్జనకోటిగూడి యా ।
పూతప్రయాగ తీర్థమున ♦ బూజ్యునకంత్యనమస్క్రియల్దగన్ ।
జేత మెలర్ప మాతకును ♦ జేయుదమింపుక చింతవీడగన్ ॥

తే॥ గీ॥ అనుచు వచియించి దేవదా ♦ సధిక శోక ।
మగ్నమానసుడై నిల్చె ♦ మాటరాక ।
చూచువారెల్ల దుఃఖంబు ♦ చూపులంద ।
నాపి మనముల నిటులెంచు ♦ చదిగిరంత ॥

చ॥ కలదు సనాతనంబగుచు ♦ గల్మలతావలమైన తోట, యం ।
దలరుల తీవలన్ గణన ♦ కందువు, మాలులు నుంచు రెండతో ।
వలపున రెండువేల శుభ ♦ వర్షములందుల కొక్క పూవు నీ ।
గల ఘనపారిజాతలత ♦ గల్గుసు నద్దియు బూసె నీతఱిన్ ॥

ఉ॥ అశుభమైనతావి భువి ♦ నంతను ఖండవిఖండభూములన్
దాశలవ్యాప్తమైతనరె ♦ నాధ్యులనేకులు పూవునంద మం ।
దాశనుజేరి మార్దవము ♦ నారసి ముగ్ధతజెంద, మాలియే ।
నాశమొనర్పబూనుట వి♦నన్సహియింపగ నెట్లు సాధ్యమౌ ॥

ప్రథమాశ్వాసము-సంపూర్ణం.

